శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము. ౩౪ { పార్థివ శ్రావణ-ఫాల్గునములు } సంచిక ౩-౬





కాకినాడ:
పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-0-0.

1945-46

# విషయసూచిక.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

కాకినాడ.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము. ౧౪ { పార్థివ శ్రావణ-ఫాల్గునములు } సంచిక ౩-౬

## శ్రీనాథుఁడు—బంగారు [illegible]లక.

కందూరి ఈశ్వరదత్తు, బి. ఏ.

శ్రీనాథుఁడు హరవిలాస పీఠికలో నవచి తిప్పయ్య సోదరుని ద్వీపాంతర వాణిజ్య వర్ణనా సందర్భమున, జలనోంగినుండి యీతఁడు బంగారు మొలకను దెచ్చినట్లు వర్ణించెను.

సీ. పంజారఁ గప్పురపాదపంబులఁ దెచ్చె
జలనోంగి బంగారు మొలక దెచ్చె

ఈ బంగారు మొలక కర్థము శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తాము నూతనముగా సంస్కరించి ప్రకటించిన హరవిలాసపీఠికలో గులాబిచెట్టన పన్నీరు మొలక యని సెలవిచ్చినారు. కాని వీరిచ్చిన యర్థము సరికాదని తలఁచుట కాధారములు గలవు. బంగారు మొలకను గూర్చి ప్రశంసించిన వాటిలో నొక సుప్రసిద్ధాంధ్రకవి గలఁడు. చెళ్లపిళ్ల నరసకవి యామినీపూర్ణతిలకావిలాసములో యామినీపూర్ణతిలక సౌందర్యమును వర్ణించుసందర్భమున నాభిని బంగారు మొలకతోఁ బోల్చినాఁడు. ఆపద్యము నిందుదాహరించెదను.

ఉ. కంటిని మాఱుపండు గసుగందని జాబిలినిగ్గు తేటిమూ
కందనిపూలగుత్తి మరుగందని తళ్కుమెఱుంగుజిల్గు వా
గందని ముద్దుచిల్క తెఱఁ గందని బంగరుమొల్కపూబడా
గందని మారువాటి వెరగందని క్రొన్నెలజింకకూన నూ
గందని తమ్మిమొగ్గ పులుగందని మత్తమసుమ్మ కొమ్మమున్

సీ. కళలు దేరెడు నిండు జిలుగువన్నెలగుత్తి
గమగమవలచు బంగారుమొలక
కొదమతుమ్మెద పాదుకొనని క్రొన్ననదండ
నడువసేర్చిన రతనంపుబొమ్మ
కతలకనిల్చు తొల్కరిమించుఁదీఁగ దె
మ్మెగ చూరగొనని కప్పురపుఁదావి
తొడఁ కోయల నుంక మాసగని వెలమావి
వెలలేని జిలుగువన్నెలకోటారు

గీ. కాంత రతికాంతకాంతుఁ బూజించు సనుచు
సంతసము నంత సంతసల్ దొంతరలఁగ
సంతరించిన వింతచామంతిబంతి
వంతుకెక్కిన నలరాజదంతి యింతి.

ద్వితీయాశ్వాసము, 70-71 ప.

పై పద్యములలోఁ గవి యుక్తవయస్సులో నున్న యామినీపూర్ణ తిలకను వర్ణించు నావసరాతిశయోక్తియలంకారమును నిరూపించెను. గమగమవలచు బంగారుమొలక యనఁగాఁ దావి యబ్బిన బంగరు మని యర్థము.

ఈ బంగారుమొలక కర్థము బ్రౌణ్యనిఘంటువునఁ గలదు.

మొలక : ఈ పడుచు బంగారుమొలకవలె నున్నది. (She is a perfect beauty)

బ్రౌణ్యనిఘంటువు, పుట 818. 1852 ముద్రణము.

ఈ బంగారుమొలకలు ఆంగ్లమున నగ్గెట్ (Nugget) అని యర్థము. పూర్వకాలమున దక్షిణాపథమునుండి సార్థవాహులు సువర్ణ ద్వీపము (Java) నుండి, యీ బంగారుమొలకలను దెచ్చుచుండెడివారట. జలసోంగి యనునది ఇప్పుడు, జావా, సుమత్రా, బోర్నియో ద్వీపములలో నొక రేవుపట్టణమై యుండనోపు. పూర్వము బర్మాలోని కొంతభాగమునకు రామన్నదేశ మనియు, సువర్ణభూమి యనియుఁ బేర్లుండెను *

శ్రీనాథుఁడు తిప్పయ శమణా, చీని, తవాయి, గోవ, రమణా స్థానంబులనుండి సామాన్లఁ దెప్పించుచుండెనని చెప్పినాఁడు. కావుట్టి శ్రీనాథుఁడు వర్ణించిన బంగారుమొలక కర్థము గులాబీ దట్టని కాదని స్పష్టముగాఁ జెప్పవచ్చును. గొజ్జాగిసీ రనఁగాఁ బన్నీరు. గులాబీసీ రని యభిప్రాయపడి, సీసపద్యము మొదటిపాదములో కవి కర్పూరపాదకములను దెచ్చినట్లు చెప్పుటచే బంగారుమొలక యనఁగాఁ బన్నీరుమొలకమై యుండునని ప్రభాకరశాస్త్రిగారు తలంచిరి. గొజ్జంగి పదమునకుఁ బూర్వనిఘంటువులలో గులాబీ యని యర్థము లేదు. కిట్టెలుదొర కన్నడనిఘంటువులలో గొజ్జఁగి పదమున కొకవిధమైన మల్లె లేక చామంతి యని యర్థము వ్రాసియున్నాఁడు. అట్లే మద్రాసు విశ్వవిద్యాలయమువారు ప్రచురించిన తమిళనిఘంటువునందుఁ గలదు.

గుజ్జిగె : గజ్జిగె; గుజ్జాగె; గొజ్జగె A kind of Jasmine
సేవన్తిగె, తెలుగు, గుజరి, తమిళము కొజంగిరి.

Kittel Dicionery.

* ఈ విషయము శోధింపఁదగినది. మఱియొక వ్యాసమున నీ ప్రసంగమును జేసెదను.

---

Now, we have definite evidence that a portion of Burma was known in latter ages as Suvarnabhumi. According to Kalyani inscriptions(1476 A.D), Ramannadesa was also called Suvarnabhumi.

Suvanadvipa Vol II. Page 46.

అవచి తిప్పయ 'చీని, సింహళ, తవాయి, హురుమంజి, జోణంగి ప్రభృతి నానాద్వీపనగరాకరములకు ధనకనకవస్తువాహనమాణిక్య గాణిక్యములను దెప్పించి యిప్పించువాఁడఁట. ఈజోణఁగిదేశ మిప్పటి తురుష్క (Turkey) పారసీక (Persia) దేశ భూభాగము. ఆనాఁటి వణిజులు పూర్వ పశ్చిమదేశములలో వాణిజ్యము సాగించుచుండినటుల శ్రీనాథుఁడు స్పష్టపఱచినాఁడు. కిట్టెల్ నిఘంటువులో జోణంగి పదమున కర్థ మిట్లు గలదు.

జోనంగ—Tbh of యవన, An Ionian, a sunk, An Arab (తురక, తురుష్కయవన Mr. 382. తెలుగు జోణంగి తమిళ మలయాళము. జోనగ, జోనగన్—A Turkish Arab)

జోణంగిదేశ మనఁగా నిప్పటి యరేబియా, టర్కీప్రాంతభూమి యని నిశ్చయము గాఁగలదు. ప్రభాకరశాస్త్రిగా రభిప్రాయపడినట్లు మలబారుప్రాంతవిషయము గాదనవచ్చును.



పూర్వభాగమునందే మఱఁగా, నిట్టి మహాకవికులగురు వగు కాళిదాసు వాడిన మాటను దోషముఁగఁజేసి ప్రయోజనాంతరమును కాదుగదా, మన స్వ్యాఖ్యానాంతరము నేని యూహించి పట్టి పూర్వుఁగలవాఁ డెవఁ డుండును?

తారకబాధితు లగు దేవతలు కోరు ప్రయోజనము కుమారస్వామి పుట్టుట అదే కుమారసంభవము (II 51-2) ఆప్రయోజనము సిద్ధించుట కుపాయము ఉమామహేశ్వరుల వివాహము ఘటిల్లఁజేయుటయే యని బ్రహ్మ యుపదేశించెను. (II 57-61) మన్మథుని బూని (III) దేవతలు కావించిన యత్నము కొనసాగక పోయినను వివాహమెట్లా పార్వతితపఃఫలముగా జరిగెనో తెలుపును. (V, VI, VII). కుమారసంభవమునకు అద్వితీయోపాయముగా నుపదేశింపఁబడిన వివాహము నెఱవేఱుటయే కథకు ముగింపు. ఉపాయ మెట్లా ఘటించినందునం దన్నిర్వర్తనముచేతనే వ్యంజితమైన ఫలసిద్ధి మరల వాచ్యముగఁ 'కుమారుఁడు గల్గె' నని చెప్పుట చప్పఁగా నుండును కావుననే వ్యంగ్యవచనము నటుం జేరనీకఁగన్న కాళిదాసమహాకవి యట్లు చెప్పఁడాయెను. 'కుమారసంభవము' నకు 'గౌరీకల్యాణ'మను పేరు నొసఁగిన యాంధ్రగద్యానువాదగ్రంథమునకుఁ బీఠిక వ్రాయుచు శ్రీయుతులు ఒంగోలు వేంకటరంగయ్య B. A., B. L. గా రిట్లు వ్రాయుచున్నారు:

The theme of this composition as conceived by the great master-poet starts from a combined request of all the Devas addressed to Brahma, the Creator, for a leader and commander of the angelic forces to war against and destroy the Titan Tarakasura and his hosts. The artistic consummation of the conception of such a plot may well be achieved and perfected by the wedding of the Divine Pair, the world-parents, Parvati and Parameswara and need not go down to the narration of the physical embodiment of the Devine Spirit into a son." సిద్ధించిన దని చెప్పుటతో నక్కఱలేకయే సిద్ధించిన ప్రయోజనము కుమారసంభవము ప్రధానముండఁగా తత్సాధకోపాయమగు పరిణయమునకుఁ బ్రాధాన్యము లేదు. ప్రధాన మేదో దానినే కాళిదాసు గ్రంథమునకు పేరుచేసెను. పూర్వోక్తాంధ్రగ్రంథమునఁ గడపటి

వాక్య మిది. "కొంతకాలమునకు గౌరీశంకరులకుఁ గుమారుఁడు జన్మించి తారకుని వధించి విశ్వకళ్యాణసంధాయి యయ్యె" కుమారసంభవము నిట్లు వాచ్యముగఁ జెప్పియు నవవాదకులు ఆపేరు నేల తొలంగించిరో ! మఱుఁగు ఆనుమాన్యంబునకే కాని ప్రొత్తందనమునఁ గాదుగదా !

II

రక్షకుని గొలక్షైన లోకుల తహతహ నిరూఢమగుటకు సాధనముగాఁ గాళిదాసు తారకాసురుని దురధికారప్రాభవమును వర్ణించిన తెలుఁగు వర్ణనీయము. (a) అతఁడు ఋతులసొత్తు నపహరించెను. మేరుశృంగముల నాత్మాలయములఁ గ్రీడాశైలములుగా సంతరించుకొనెను. మిన్నేటివసిఁడితామరల నూడఁబెఱికి తనదిగ్గియలలోఁ బాదుకొల్పుకొనెను. విమానమార్గముల నోరులం దెఱచూపనీయక వానిని తనసంచారమునకే యుంచుకొనెను. దేవతల హవిర్భాగముల నడిసి తీసికొనెను. ఇంద్రుని యుచ్చైశ్శ్రవమును హరించెను. రత్నాకరముల రత్నముల నన్నిటిని నాఁచికొనెను. పుష్కలావర్తకాది మేఘములం దన దంతావళముల వప్రక్రీడకు లోఁబఱచెను. (b) తనకు లేని కల్పవృక్షముల దేవతల కేలయని వానిని తెగనఱికించెను. (c) లోకక్షేమమునకై పాటుపడు సూర్యచంద్రవాయ్వాదులం దనసేవకే కట్టువఱచెను. తన కోలఁకుల కమలములను విరియించుటయే సూర్యునకును, తనవిశాలికారములకు వెన్నెలం గూర్చుటయే చంద్రునకును, తనకు పువ్వులం జేర్చిపెట్టుటయే ఋతువులకును, తనకుఁ జామరములు వూనుటయే అచ్చరలకును వారి శిరోరత్నముల వెలుఁగునం దననగరమును బ్రకాశింపఁజేయుటయే వాసుకిప్రముఖసర్పరాజులకును- పనులుగాఁ గల్పించెను. (d) లోకములం దాఱుమాఱు గావించెను. సూర్యుని కెండకాలమున సైతము వేఁడిమి లేకుండునట్లును, వెన్నెలకు పెరుగుట, తరుగుటలు లేకుండునట్లును, వాయువునకు విశృంఖలసంచారము లుడుగునట్లును, ఋతువులకుం గ్రమప్రాప్తిము కొంత లేక చలి యున్నను ధర్మములు తప్పునట్లును

చేసెను. తారకాసురుని దురధికారంపుంబ్రాధవము సహింప నెవరికిని సాధ్యపడదయ్యెను. కానుకలు పెట్టి సుముఖుంజేసికొందమా యన్న, దుర్జనుం డగుటచే నతండు ప్రత్యపకారము చేయం డనే కాని ఉపకారములకు లొంగండు పోరి జయింతమా యన్న విష్ణువునంతటి దేవునకుం గూడ నది యసాధ్యమాయెను. కావుననే కుమారస్వామి యవతరింప వలసివచ్చెను. అదే ఏతత్ కావ్యప్రతిపాద్యప్రయోజనము.

తారకాసురసంహారసమర్థుఁడగు చమూపతి నొకనిఁ బ్రసాదింపుమని దేవతలు బ్రహ్మదేవుం బ్రార్థింప నాతండు పెద్ద యుమాశంకరుల కుమారుఁడే యట్టిఁ డగునని యు, నుమాసౌందర్య మీశుని చిత్తము నాకర్షించునట్లు చేయుటయే వారి వివాహమును ఘటిల్లఁజేయు నుపాయమనియు నుపదేశించెను. ఆయుపాయము సాధ్యమగుటకు హేతువైన యందలి లోప మేమనఁగా, ఈశుం డాశ్రితంగూర్చిన విస్మృతి. ఇక బ్రహ్మదేవునకె క్రమ్మరన నింక దేవత లితరు లందుకు లోనగుటలో వింతలేదు. దేవతలు మన్మథుం బూన్చిరి. మన్మథోద్యోగము

(సశేషము)

# దర్శనసమీక్ష.

సాహిత్యశిరోమణి, భాషాప్రవీణ.
చిలుకూరి వీరభద్రశాస్త్రి

(అనువృత్తము)

## నకులీశపాశుపతదర్శనము.

ఈ దర్శనమున నీశ్వరుఁడే జీవులను గాపాడువాఁడుగా నంగీకరింపఁబడి కార్య, కారణ, యోగ, విధి, దుఃఖాంతము లనియెడు నైదుతత్త్వములు ప్రతిపాదింపఁబడినవి. పశుపాశుపతిశబ్దములు లక్షింపఁదగిన సభాష్యములచే నిర్వచింపఁబడినవి.

శ్లో. బ్రహ్మాద్యాస్స్తంబపర్యంతాః పశవః పరికీర్తితాః.
తేషాం హి నాయకో యస్మాచ్ఛివః పశుపతిః స్మృతః.

పశువులు జీవులు. పశుపతి యీశ్వరుఁడు. చేతనాచేతనాత్మకమగు ప్రపంచమునఁ గల పదార్థజాతి యంతయు కార్యము. ఈశ్వరుఁడు కారణము. ఇతఁడు స్వతంత్రుఁడు. జపము, ధ్యానము, మున్నగునవి యోగము. మూఁడుకాలములయందు స్నానము, భస్మస్నానము మొదలగునది వ్రతము. పాశముల విడి యీశ్వరుఁ డగుటయే దుఃఖాంతము. వీరిమతమున మోక్ష మీదుఃఖాంతమే. ఈ పంచతత్త్వాత్మకమగు పాశుపతతంత్రమువలననే ముక్తి కలుగు నని వీరినమ్మిక. కావుననే—

శ్లో. జ్ఞానమాత్రే వృథా శాస్త్రం సాక్షాద్దృష్టిస్తు దుర్లభా,
పంచార్థాదన్యతో నాస్తి యథావత్తత్త్వనిశ్చయః.

అని యభియుక్తవాక్యము.

---

## శైవదర్శనము.

కర్మాదినిరపేక్షుఁ డీశ్వరుఁడు కారణ మనుటలో వైషమ్యము, నైర్ఘృణ్యము ననెడి దోషము లీశ్వరునకుఁ దటస్థించును. అని యీమత

మూవారు ఈశ్వరుఁడు కర్మసాపేక్షుఁడయి కారణ మగు నని యంగీకరించుటయేకాక తత్త్వములనిట్టిరీతిగా నంగీకరించిరి ౧ పతి. ౨ విద్య. ౩ అవిద్య ౪ పశువు, ౫ పాశము, ౬ కారణము వానిలో పతి శివుఁడు. తత్త్వజ్ఞానము విద్య. విద్యాజ్ఞానము అవిద్య అణుత్వము మలము. మాయారోధము, కర్మ శక్తి, యను భేదములతోఁ గూడినది పాశము. (జీవబంధము) శివుఁడు పశువు పాశనివృత్తికయి జపధ్యానాచరణము కారణము.

శ్లో. పతిర్విద్యా తథా విద్యా పశుః పాశశ్చ కారణం,
తన్నివృత్తా వితి ప్రోక్తాః పదార్థాః షట్ సమాసతః.

ఈ తత్త్వములకు యోగ్యముగాఁ దెలియుటవలనఁ బాశవిమోచన మగును. దానిచే నీశ్వరత్వము పొందుట రూపమయిన మోక్షము లభించు నని యీదర్శనకారులసిద్ధాంతసంక్షేపము.

---

## ప్రత్యభిజ్ఞాదర్శనము.

ఈ మతావలంబులు మాహేశ్వరులు. వీరు మోక్షప్రాప్తికై ప్రత్యభిజ్ఞయే (అతఁడే నేను, వాఁడే వీఁడు, అదే యిది యని తెలియుట) ప్రధాన మగు సాధన మని యందురు. ఈశ్వరుఁడు పూర్ణుఁడు, స్వతంత్రుఁడు. కావున జగత్తును నిర్మించుటకయి కర్మాదిసాధనమును దేని నపేక్షింపఁడు. తన యిచ్ఛచేతనే యంతయు నిర్మించును.

చైతన్యము జీవేశ్వరులకు సహజము. కావున జీవులు పరస్పరము భిన్నులయినను నీశ్వరునికంటె భిన్నులు కానేరరు. పరమేశ్వరునిలో జీవతాదాత్మ్య మనుభవసిద్ధము. కావున జీవులచే నీశ్వరునితోఁ దాదాత్మ్యమును బొందుటకై ప్రత్యభిజ్ఞ యాశ్రయింపనగును.

ప్రత్యభిజ్ఞ యన 'నేను ఈశ్వరుఁడను. ఈశ్వరునికంటె భిన్నుఁడను గాను.' అను సాక్షాత్కారము. కేవల మట్టి సాక్షాత్కారము చేతనే శ్రేయస్సు, మోక్షముఁ గూడ లభించును. మోక్షమునకయి

ప్రాణాయామాదులయపేక్ష వీరిమతమున లేదు. శరీరము నిందింపఁ
జేయుట, భస్మస్నానము, జపము, పరిచర్య చేయుట మోక్షమున కనవ
సరము.

ఈశ్వరునివలెనే జీవుఁడు చైతన్యస్వరూపుఁడయినను మాయావ
శుఁడగుటచే నీశ్వరాంశమై భాసించుటలేదు. ఈశ్వరునివలె పరిపూర్ణ
చైతన్య స్వరూపుఁడై భాసించుటకుఁ బ్రత్యభిజ్ఞ యత్యంతాపేక్షితము.
బ్రత్యభిజ్ఞాబలముచే "పూర్ణచైతన్యాత్మత్వమే మోక్షము" అని ప్రత్య
భిజ్ఞాదర్శనకారులభిప్రాయము. ఈవిషయమై పెద్దల యూహ యీ
క్రిందిరీతిది—

శ్లో. తైస్తై రప్యుపయాచితై రుపనతః తన్వ్యాః స్థితోఽప్యంతికే
కాంతో లోకసమాన ఏవ మపరిజ్ఞాతో న రంతుం యథా,
లోక స్యైష తథాఽనపేక్షితగుణః స్వాత్మాపి విశ్వేశ్వరో
నైవాయం నిజవైభవాయ తదియం తత్ప్రత్యభిజ్ఞోదితా.

---

## రసేశ్వరదర్శనము

పారదము (పాదరసము) మున్నగు శబ్దములచే వ్యవహరింపఁబ
డెడు నేరసము కలదో యారూపుఁడగు నీశ్వరుఁడు రసేశ్వరుఁడు. ఈరసే
శ్వరుఁడు శరీరమునకు దృఢత (బలము) నొసంగి ముక్తికి హేతువగు నని
తలంచుమహేశ్వరులు రసేశ్వరులనఁబడుదురు. వారలచే రచింపఁబడిన
దర్శనము రసేశ్వరదర్శనము.

వీరిమతమునను జీవాత్మలు చైతన్యస్వరూపులగుటచే నీశ్వరస్వ
రూపులే. పాదరసమును సేవింప దానివలన నగుశరీరదార్ఢ్యముచే
నీశ్వరత్వప్రాప్తిరూప మగుజీవన్ముక్తియు నగు. ఆజీవన్ముక్తినే మోక్షము
గ నంగీకరింతురు. జీవించియుండఁగా నగుముక్తి జీవన్ముక్తి. ముక్తియన
మూలాజ్ఞానము నశించుటవలన నగునిజస్వరూపావాప్తి. అది జ్ఞానముచే
సాధింపవలయును. 'తమేవ విదిత్వా' అని శ్రుతి. ఆత్మతత్త్వవిషయమగు

తెలిసికొని జ్ఞానము. 'తత్త్వమసి,' మొదలగువాక్యములవలనఁ గలుగు జ్ఞానమే మోక్షసాధనము. ఆజ్ఞాన మభ్యాసాతిశయమువలన లభించును. అభ్యాసము చేయవలయు నన్నచో శరీరబల మత్యంతావశ్యకము.

శ్లో. ఇతి ధనశరీరభోగా న్మత్వానిత్యా న్సదైవ యతనీయం,
ముక్తౌ సాచ జ్ఞానాత్ తచ్చాభ్యాసాత్ సచ స్థిరే దేహే.

శరీరస్థైర్యము పారదాదిపదవాచ్యమగు రససేవనముచే లభించును. ఆరసమునకు పారద మనుపేరు 'పారం దదాతి పారదః' అను వ్యుత్పత్తిచే సంసారముయొక్క యవ్వలియొడ్డును బొందించుటచేఁ గలిగినది. దీనివయమునఁ జెప్పఁబడె —

శ్లో. సంసారస్య పరం పారం దత్తేఽసౌ పారదః స్మృతః
పారదో గదితో యస్మాత్పరార్థం సాధకోత్తమైః.

అని చెప్పెదరు ఈ పాదరసము సాక్షాత్తు మోక్షమునొసంగఁజాల దనియును మోక్షసాధనాభ్యాసమునకుఁ గావలసినశరీరపాటవము నొసంగి మోక్ష మీయఁగల దని వీరియాశయము.

కావున జీవన్ముక్తి కోరుప్రతిమానవుఁడు మొట్టమొదట పాదరసమును సేవించి శరీరపుష్టిని సంపాదింపవలయును. అనంతర మాత్మతత్త్వ మభ్యసింపవలయును. ఆయభ్యాసమువలన మిథ్యాజ్ఞానము సమూలముగ నశింప జీవన్ముక్తి యగు నందురు

ఇతరదర్శనకర్తలు శ్రవణము, మననము నిదిధ్యాసనము, మున్నగుసాధనములచే జీవన్ముక్తి యగునందురు పర మంగీకరించిరేగాని జీవన్ముక్తి నొప్పుకొనరు. వాతిము "శ్రు. తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే అథ సంపత్స్యే; శ్లో. వద్ధస్యోఽపి ముక్తిస్తు దేహితా పిండపాతనే, శరాబులగన త్యాపి ప్రత్యక్షా నోపలభ్యతే" అని శ్రుతిస్మృతులందు దేహపాతానంతరమే ముక్తి చూపఁబడినది. ఈపరిదృశ్యమానమగు దేహ మాఱుకోశముల (ధాతువుల)చే నిర్మిత మని ప్రసిద్ధము. వానిలో చర్మము, రక్తము మాంసము, అనుమూఁడు కోశములు తల్లి

శరీరము వలన వచ్చును. మేదస్సు, ఎముకలు, మజ్జ యనెడిమూఁడు కోశములు తండ్రివలనఁ బొందఁబడును. ఇట్టియాఱుకోశముల వలన నిర్మింపఁబడినయీశరీరము నాశమునొందుట యెల్లరకుఁ బ్రత్యక్షము. అట్టిసమయమున జీవించియుండఁగా జీవన్ముక్తి (శాశ్వతకైవల్యము) గాంచుట యెట్లు పొసఁగ దని యందురు.

కాని తల్లిదండ్రులవలన నగు షాట్కౌశికదేహమున కస్థిరత (నాశము) అగుఁగాక. పారద, అభ్రక పదములచే వ్యవహరింపఁబడు హరగౌరీసృష్టివలన నయినశరీరము నిత్యము (అనపాయము.) అందు హరసృష్టి పారదము గౌరీసృష్టి, అభ్రకము. ఇట్టివిషయము ప్రతిపాదితము-

శ్లో. అభ్రకస్తవ బీజంతు మమ బీజంతు పారదః

ఈశ్వరుని శరీరమువలనఁ గలిగినదగుటచేఁ బాదరసమునకు 'రసేశ్వర' మనెడిపేరు ఇట్టిరసేశ్వరమును (పారదమును) సేవించుటచే దాని సంపర్కము వలన ననపాయమగుశరీరము లభించు షాట్కౌశిక దేహముఁ గూడ ననపాయి యయినిలుచును. మఱియు నీషాట్కౌశిక దేహము గౌరీసృష్టివలన నగుశరీరసంపర్కముచే దివ్యము, దృఢతరము, కూడ నగును. లోహము పారదభేద మగుటయను వేధిసంబంధమువలన సువర్ణమగుట యనుభూతము. రసార్ణవమున నీవిషయ మిట్లు చర్చింపఁబడినది.

శ్లో. యేచాత్యక్తశరీరా హరగౌరీసృష్టిజాం తనుం ప్రాప్తాః
ముక్తాస్తే రససిద్ధాః మంత్రగణః కింకరో యేషాం.

అట్టిమనుజులకు జీవించియుండఁగనే ముక్తియగుటలో విప్రతిపత్తి యేమియు లేదని వీరి రాద్ధాంతము.

కావున దర్శనకారులచే నంగీకరింపఁబడిన జీవన్ముక్తి కరతలామలకమువలె రసేశ్వరసేవనముచేఁ బ్రత్యక్షమగుటలో సందేహమేమియు లేదు. జీవన్ముక్తియే లేదను రామానుజాదు లపేక్షార్హు లని వీరియభిప్రాయము.

శ్లో. యస్మాత్ ప్రాకరణాని మోచనధియాం సాధ్యః ప్రకృత్యా పునః
సంపన్నః పురాతే న దీవ్యతి పరం వైశ్వానరే జాగ్రతి
జ్ఞాతో యద్వ్యకరం నవేదయతి చ స్వస్మాత్ స్వయం ద్యోతతే
రసా బ్రిహ్మైవ స ద్వైస్యసంస్కృతిభయా త్వాయా దసా పారదః.

ఈవిధముగ రసమునకు పరబ్రహ్మ సామ్యాంగీకారమునకు 'రసో వై సః రసం హ్యేవాయం లబ్ధ్వా నందీ భవతి, అను మూర్ధన్యప్రమాణమగు శ్రుతి యున్న దని వీరి గర్జనము.

---

పాణినీయదర్శనము.

పాణినిచే రచింపఁబడిన సూత్రములు, వానిననుసరించి రచించిన వార్తికములు, భాష్యమును గలసి 'పాణిని దర్శన' మనఁబడును'

వీరలు జగత్తునంతకుఁ గారణముగ నద్వైతులు బ్రహ్మము నొకఁ జేతత్వముగ నంగీకరించినటుల 'స్ఫోట' యను పేరుకల, నిరవయము, నిత్యము నగు 'శబ్ద'మను తత్త్వము నంగీకరింతురు దానినే బ్రహ్మ మందురు. వాచకమగు స్ఫోటశబ్దమునకు వాచ్యమగు బ్రహ్మకు నభేదమగుటచే 'స్ఫోట' యే శబ్దబ్రహ్మ మగుటకు సందియము లేదందురు.

మఱియు శబ్దములన్నియు నర్థము చెప్పునపు వాయాయి సత్తలను (స్థితులు) జెప్పినను వాయానత్త యంతయు బ్రహ్మసత్త యగుటచే బ్రహ్మమే యన్ని శబ్దముల కర్థమయి యుండును. కావుననే శబ్దము నుచ్చరించినను పరబ్రహ్మోపాసనవలనఁ గలుగు ఫలితము (పుణ్యము) లభించును. 'సోఽర్థస్య శబ్దః యత్సంబన్ధ స్సోఽర్థః, యను తాదాత్మ్యము వీరికభిమతముగదా. ఇట్టి శబ్దబ్రహ్మోపాసన శుద్ధముగాఁ జేసిన బ్రహ్మము నొందుటయందు సందియము లేదని వీరలయభిప్రాయము. స్మృతి. శ్రుతి.

"శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరంబ్రహ్మాధిగచ్ఛతి".

"ఏకశబ్దః ...... కామధుగ్భవతి ...... అని. జీవుఁ డనియు నీశ్వరుఁడనియు భేదము లేనియద్వయతత్త్వమునకు భేద మెటులు కల్పిత

మీా ఘటులనే వాచకమనియు,వాచ్యమనియు,వానికి సంబంధమనియు, నిటియంతయుఁ గల్పితమే. కావున నట్టి స్ఫోట బ్రహ్మమును గలవాస్త విశైక్యము గాంచుచోఁ బ్రహ్మాగభిన్నమును, స్వయంజ్యోతిరూపమును నగు బ్రహ్మ మభివ్యక్త మగును. అయ్యదియే మోక్షము. స్ఫోటరూపమగు నీబ్రహ్మమునందు రజ్జువునందు సర్పమువలె నీప్రపంచ మంతయు వివర్త భావము నొందును. కావుననే యాద్యసృష్టియంతయు శబ్దరూప మయి నది. ఈవిషయమును శ్రుతిస్మృతులైకకంఠ్యముతో నిట్లు నుడివినవి.

శ్రు. "ఋఙ్మయో యజుర్మయః సామమయో వై రాజః పురుషో వై యజ్ఞః తస్యైతా లోకం కృణాస్త్రిన ఆహుతయ స్తా వై త్రయో లోకాః"

శ్రు. "ఏష వై ఛందస్యః సామమయః ప్రథమో వై రాజః పురుషో యోఽన్న మస్సృజత, తస్మాత్పశవోఽజాయంత. పశుభ్యో వనస్పత యో వనస్పతిభ్యో ఓషః"

శ్రు. వర్ణేన విశ్వా భువనాని జజ్ఞే తాని ఇత్సర్వ మమృతం యచ్చమ ర్త్యం." అని

స్మృ. సూత్రభాష్యమున "శబ్ద ఇతిచేన్నాతః" అనుసూత్రముచే శబ్ద పూర్వకము సృష్టి చెప్పఁబడినది. దీనిని నాచార్యులవా రిట్లు నిర్ణయించి యున్నారు. "కథంపున రవగమ్యతే శబ్దాత్ప్రభవతి జగదితి ?" "ప్రత్యక్షానుమానాభ్యాం" ప్రత్యక్షం శ్రుతిః ప్రా మాణ్యం ప్రత్యనపేక్షత్వాత్, అనుమానం స్మృతిః, ప్రామాణ్యం ప్రతి సాపేక్షత్వాత్.

శ్రుతి. "సమనసా వాచా మిథునం సమభవత్."

స్మృతి. అనాదినిధనా నిత్యా వాగుత్సృష్టా స్వయంభువా
ఆదౌ వేదమయీ దివ్యా యతః సర్వాః ప్రవృత్తయః
నామరూపం చ భూతానాం కర్మణాం చ ప్రవర్తనం
వేదశబ్దేభ్య ఏవాదౌ నిర్మమే స మహేశ్వరః

సర్వేషాం తు సనామాని కర్మాణాం చ ప్రవర్తనం
వేదశబ్దేభ్య ఏవాదౌ పృథక్సంస్థాశ్చ నిర్మమే.

అని పరబ్రహ్మము శుద్ధస్వరూప మయినచో నీస్ఫోటశబ్దము వ్యక్తమగుపరబ్రహ్మస్వరూపముగా నండును. ఎప్పుడు పరబ్రహ్మముసకు శక్తితో సంబంధము కలుగునో యప్పు డాఘాతము (దెబ్బ) కలుగుటచే సూక్ష్మధ్వని కలుగ స్ఫోటశబ్దము వ్యక్త మగును. దానినుండి 'బహుస్యాం ప్రజాయేయ' అను ప్రాథమికేచ్ఛారూప మగుకార్యము జనించును. ఆ యిచ్ఛానంతర మనేకము లగు పదార్థము లుత్పన్నము లగును. పదార్థము లన్నియు నవిద్యాకల్పితము లగుటచే వాస్తవికము లు కానేరవు. కావున స్ఫోటరూప మగుపరబ్రహ్మనకాశమునుండి వివర్తరూప మగుమాయికమగు నిసర్గసృష్టియగుటచే నాస్ఫోటబ్రహ్మమును శుద్ధముగఁ దెలియుటవలన మోక్షము కలుగునని వీరలనిశ్చయము ఈవిషయమునకయి పెద్దల యభిప్రాయములు.

'అనాదినిధనం బ్రహ్మ...'
'స్వరూపజ్యోతిరేవాంతః సూక్ష్మా వాగనపాయినీ
తస్యాం దృష్టస్వరూపాయాం అధికారో నివర్తతే'
"ఇద మాద్యం పదస్థానం సిద్ధిసోపానపర్వణాం
ఇయం సా మోక్షశాస్త్రాణా మజిహ్మ రాజపద్ధతిః
'అక్షరాణా మకారస్త్వం స్ఫోట స్త్వం వర్ణసంశ్రయః' అని.

స్ఫుటత్యర్థోఽస్మాదితి స్ఫోటః అను వ్యుత్పత్తిచే స్ఫోటయన శబ్దము. వాక్కు శబ్దము నాలుగుతెఱఁగులది. పర - పశ్యంతి - మధ్యమ - వైఖరి యని. అందు మూలాధారచక్రమునఁ గలవాయువునకు సంస్కారకము మూలాధారస్థము, శబ్దబ్రహ్మరూపము, స్పందశూన్యము, బిందురూప మయినది 'పరావాక్కు.' నాభిపర్యంతము వచ్చిన వాయువుచే నభివ్యక్త మయిన మనస్సునకుగోచరించునది 'పశ్యంతీ వాక్కు.'

(సశేషము)

# కళాపూర్ణోదయము.

దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి

(అనువృత్తము)

9. మధురలాలసను వర్ణించు సందర్భమున

"సంజఁ గెంపారుచున్న పూజలదరేఖ
యందు నొక్కింత మినుమినుకు మనుచుఁ దోఁచు
చిన్నితారలగతిఁ రాజిల్లుచున్న
చెలువ చలువ మోవిమెఱుఁగునఁ బలుకుఁబడిని"

ఈ పద్యము వ్రాతప్రతులలో నొకటి రెంట బహుశః వావిళ్ల సరస్వతీపత్రులలో మాత్రమున్నది. అన్నను శ్రీ శాస్త్రిగారికి ప్రక్షిప్తమని తోఁచినదఁట. దీనిని మూలమునఁ జేర్పలేదు. పరిశీలింప నీపద్యము ప్రకరణవిరోధము కల్పింపదు. మఱియు నేలూరి వ్రాతప్రతిలోఁ గించిద్భేదముగ నుండుటంబట్టి నూతన ముద్రితమున గ్రహింపఁబడినది. ఆపాఠము సమ్మతముగాఁ గూడ నున్నది.

"సంజఁ గెంపారుచున్నంపుజలదరేఖ
యందు నొక్కింత మినుమిన్క మనుచుఁ దోఁచు
చిన్నితారలగతిని రాజిలెడుఁ జెలువ
పలువరుస మోవిమెఱుఁగునఁ బలుకుఁబడిని"

(౭. ౧౩౧. ప్ర.)

మాటలాడునటి మోవిమెఱుఁగుననున్న యామె పలువరుస సంధ్యారాగాంకితమగు జలదరేఖయందున్న చిన్నతారలరీతి విరాజిల్లెనని యాశయము. మఱియు నియ్యది ప్రక్షిప్తము కాదనుటకును పింగళి సూరనార్యునిదే యనుటకును ప్రభావతీప్రద్యుమ్నమందలి యీక్రింది పద్యము గూడ నొక్క సాక్ష్యమీయఁగలదు. ఈపద్యచ్ఛాయయు, పదములును గూడ నిద్దానియందున్నవి.

"మృదులపవనాహతి నొకింత గదలియాడు
పల్లవము మాటునను దోఁచు మొల్లమొగ్గ
చాలుగతిఁ బల్కుబడి మోవిచాటునఁ గనఁ
బడుచు నింతి పల్వరుస కన్ భ్రాంతమయ్యె." (ప్రభా. ౨. ౬౪)

10. మఱియు నీసందర్భముననే

"అతను దళదిశావిజయకీర్త్యంకురముల
మీఁద మొనపుగ వెలువడి మెఱయు విత్తు
లతివపదనఖములు వానియంతికమునఁ
జెలువ కిడిన లతావిశేషంబు మేరు"

(౭. ౧౩౭. వా. బ ౧౪౧. ప్రా.)

ఇట "వెలువడి మెరయువిత్తు. క. ఖ. గ. మెఱుయు. ఘ. వెలువడు మెఱుము. నా సవరణ" అని చిత్తులో వ్రాయించిరి. "మొన వగ వెలువడు మెఱయు విత్తు" అని మూలమం దిచ్చిరి. ఇట నీ దిద్దుపాటక్కఱ లేకయే పద్యార్థము సరిపడఁగలదు.

ఈ యువతియొక్క పైభాగమునకున్న పదనఖములు మదనుని విజయకీర్త్యంకురములపై భాగముననున్న ప్రకాశించువిత్తులవలె నున్నవని యన్వయము. అంకురముల మార్దవము వ్రేళ్లకును బీజభాగముల పోలిక గోళ్లకును గలదని ఫలితము.

11. (౭. ౧౪౮ ప్రా.) పద్యమున మధురలాలస శ్రీఁగంట విభుని గాంచినప్పుడు ఆకన్నులు రెండును ఎదురుపడు రతిస్మరుల యాందోలములవలె నున్నవని వర్ణించు సందర్భమున వర్ణ్యమానపద్యమునందు లోపించి ముద్రితముల నున్నది. 'దృష్టఁ బోలిచ' అన్నది ముద్రణ ప్రమాదము. 'కొల్కులు దలిర్ప' అని వ్రాఁతప్రతిపాఠములు. 'కొల్కులుదలిర్ప' అని బరూరి ప్రతి. ఇందు 'దృష్టు' అను పాఠము 146 నంబరు గల తంజనగరప్రతిలో దొరకినది. 'కొల్కులఁదలిర్ప' అను పాఠము శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు నెత్తినది. మఱియు నిందలి 'కడపళ్లు' అన్నచోట 'కడపట్లు' అని చిన్నయసూరి పాఠము. 'పట్టుపడాల' అన్నచోట 'పట్టుసడాల' అనియు 'కొలుకులుదలిర్ప' అనియు నేలూరుప్రతి పాఠము. వీనినుండి యుక్తతమగు పాఠము గ్రహింపఁబడినది. మఱియు నీపద్యమందలి 'తబ్బిరపుదండెలు' అని ముద్రిత

మూలలోని పాఠము (శ్రీ) మల్లాదివారు బహుప్రతులబట్టి 'అంబగపుదండలు' అని మార్చియున్నారు. దీని కర్థమేమో తెలియదు సరిగదా యీయాదిగాపాటున యతి చెడినది. సరియగుపాఠమును పేజీక్రిందఁ జిత్తులోఁ జేర్చితి. ఈపద్యార్థము కష్టగ్రాహ్యమగుటచే దీనిభావము వెన్నెలలో వివరింపఁబడినది.

(12) కళాపూర్ణుఁడు మధురలాలసపాట విని యద్భుత మందిన సందర్భమున:—

"వీరికి వ్రాల్ప దోఁచిన యహింసకటగాని నిజంబు చెప్పకే
నేర మటుంగువాఁ ధరణీవర యింకను నీవు మాత్రరో
దీరణ సత్కీర్తులనకు నీడుగఁ బల్కెడుపీణ లేద......"

(౭. ౧౯౬. వా. బ. పే. ౧౯౭ పు. ౨౦3 పం.)

ఈపద్యమందలి 'నీవు' అనుపదమున కన్వయము లేదు. ముద్రితము లన్నిట నిట్లే యున్నది. కాఁబట్టి యట 'నీకు' చేర్చి మల్లాదిప్రతి 'నాసవరణ' మన్నది.

"...ధరణీవర యింక నీమందు..." అని వేలూరిప్రాఁతప్రతి పాఠము. దీనినే నూతనముద్రితము గ్రహించినది. కానఁ బైసవరింపుతోఁ బనిలేదు. మిగిలిన చిన్నమార్పులను వేలూరిప్రతియందలివే.

(13) కళాపూర్ణుని జైత్రయాత్రాసందర్భమున:—

"శ్రీవఁ బాఁజులఁ బెట్టి తోలుతగాఁ దమతము
మొనల గల్పఱచుచమూపతులును"

అని పూర్వముద్రితప్రతులపాఠము.

"మొన లగపఱుచుచమూపతులును" ౪. 3౦ ప. ప్ర. అని మల్లాదివారిపాఠము. ఇట వీరు "మొనల గల్వఱచు, ప. ఫ. ఐ. 'గల్వ రచు' క. గ. సవరించితిని" అని చిత్తులో వ్రాసిరి. ఈయర్థసిద్ధికై 'గల్ప ఱచు' 'గన్పఱచు' గా నూతనప్రతి గ్రహించినది. ఇట 'మొగల వేర్ప ఱచు' అని వేలూరిప్రాఁతప్రతి. ఇది యన్నిటికన్నను మంచిపాఠము. ఇట 'సవరణ' అవసరము లేదు.

'నూతనపాఠము' లలో జూపినది. బరూరు, సరస్వతీ, వావిళ్ళ ప్రతులం దాయాతావు లర్థవంతములుగా గానరావు. వానిని విస్తరభీతిని ప్రత్యేకముగా వివరింపక పద్యసంఖ్యలను మాత్ర మిచ్చుచున్నాను. చివరి నూతనపాఠములలో, జూచి శ్రీశాస్త్రిగారికి తగిలిన "సవరణలు" ఏయే ప్రతులయందు దొరకినవో పాఠకులు నూహముగ గ్రహింతురుగాక.

| ఆశ్వాసము. | వల్లాదిప్రతిపద్యసంఖ్య. | నూతనప్రతిపద్యసంఖ్య. |
|---|---|---|
| 3 | 58 | 60 |
| 3 | 157 | 158 |
| 4 | 20 | 21 |
| 4 | 181 | 182 |
| 4 | 203 | 205 |
| 5 | 64 | 64 |
| 5 | 69 | 69 |
| 7 | 78 | 78 |
| 7 | 100 | 102 |

ఇట్లు శ్రీసూర్యనారాయణశాస్త్రిగారు చేసిన 'నాసవరణ' లలో కొన్ని చేయనవసరము లేనివియు, కొన్ని ప్రతులలో నున్నవియు నై యున్నవి

## యతిభంగములు.

మఱియు నీకళాపూర్ణోదయము వ్రాతప్రతులలో నెక్కుడావుల యతిభంగములు గానవచ్చుచున్నవి. వ్రాతప్రతులు గాంచుచో నీయతిభంగములే గాక మఱికొన్ని ఛందోభంగములుగూడ ముద్రితప్రతులంగ నుందును. ప్రకృతము వాని నంటక వావిళ్ళ వల్లాదివారి ప్రతులందు గోచరించిన యతిభంగములను, వానికడ నూతనప్రతి గ్రహించిన సాధుపాఠములను జూపెదను.

(1) శ్రీ. త్రైలోక్యస్తుత్యుల స్పందనల నరయుయశోధనగానోత్సాహ్వయ......, ౧. ౭౬ మల్లా. ప్రతిలో మూఁడు యతిస్థానములు. అందు మొదటిసంయుక్తాక్షరమున కోటాగము గ్రహింపఁబడి యతి నిలుపఁబడినదో చివరికంటు సద్భాగనే కలుగవలె నని కోయమము గలదు. ఈ పాదమున మూఁడవచోట జరూర సరస్వతీవాణీశ్యమల్లాది వారల ప్రతులలో యతి చెడి యున్నది "త్రైలోక్యస్తుత్యుల స్పందనుల నరయుయశోధన్య......" ౧ ౭౬ శ్రీ. అని నూతనప్రతిలో లభించిన పాఠము. ఇం దాదోషము తొలఁగినది.

(2) "వలలుకోనికదిండివారువము దోలుచు" 3. ౬౬ మ. ఇది గీతపాదము. మల్లాదివా రిట "వావరము. క. గ. వారవము ఖ" అని చిత్తులో వ్రాయించిరి. యతి పోయినసందర్భము గమనింపరైరి. ఇట.

"వలలుకోనికదిండివార్వమ్ము దోలుచు" అని వాణీశ్యసరస్వతీ బరూరిప్రతులపాఠము. ఇందు యతి పోలేదు. ఈపాఠమే నూతనప్రతి గ్రహించినది. (చూ. 3. ౬౮ శ్రీ.)

(3) "అనఁగఁ దనూలత ల్నులయుఁ సదీర్ఘరహంబున కోర్వలేక పెం" అని మల్లాదివారిప్రతి. ఇది చంపకపాదము. శ్రీశాస్త్రిగా రిట "సదీర్ఘరహం. మ. ఫ. బ" అని చిత్తులోఁ జూపిరి. ఇదియే సరియైనపాఠము. మూలమున నున్నపాఠము యతి తప్పినది. ముద్రితము లన్నిటను మంచిపాఠమే గ్రహింపఁబడినది.

"...అనఁగఁ దనూలత ల్నులయు సదీర్ఘరహంబున కోర్వలేక..."
(3. ౭. శ్రీ. ప్రతి.)

(4) సదయత్వంబున నొత్వారత్వారపు లిచ్చో సవ్వరన్ లేర" అని (3. ౧౫౭ మల్లాదిప్రతి) ముద్రితప్రతు లన్నిటను యతి తప్పిన పాఠమే యున్నది. ఇది మత్తేభపాదము. పై పాదమున స్వరమైత్రి లేదు

"సుదయ............ఇచ్చో నవ్వరన్ లేర, యూ" అని యే బూరిప్రతి. దీనినే నూతనప్రతి చేకొన్నది. (చూ. 3. ౧౫౮. శ్రీ.)

(5) "నాకు మరుఁడు నిన్ను నేలు మనరా కునికిన్" అని 3. ౨౮3. మల్లాదిప్రతి ఇట యతి తప్పినది. ఇది కందపద్యపాదము. ఇచట శ్రీ సూ. శా. గారు "నిలుపనుసన్ రా, వు. ఫ. బ, అని చిత్తులోఁ గూడ వ్రాసిరి. కాని యిట ముద్రితము లన్నిటను "నాకు మరుఁడు నిన్ను నిలు మనన్ రాకునికిన్" అను నిర్దుష్టపాఠ మున్నది. నూతన ముద్రణము గూడ పై పాఠమే గ్రహించినది. (చూ 3. ౨౮౫. గ్రం.)

(6) "...నా,కు నభిమతంబె నీకుఁ దగ నన్నతలంపున..." అని వావిళ్లప్రతిపా. ఇట యతి తప్పినది. ఇది "నీపొందు నా కిష్టము కాదా ? తప్పక నమ్మితమే"అని మణికంధరునితోఁ గలభాషిణి వచించు సందర్భమున నున్నది. చంపకపాదము, కాఁబట్టి భావము చెడకుండ యతిని సవరించికొన్నతంజనగరప్రతినుండి,

" నా, కనభిమతంబె నీకుఁ దగ నన్న..., అని నూతన ప్రతి గ్రహించినది. ( చూ ౪. ౧ ౮ గ్రం. )

(7, "జృంభితతనో)ష భాష వినఁబడ నంతన్,, (౫. ౫౭ మల్లా) మల్లాదివారిప్రతిలో పై చోట యతి పోయినది. ఇది కందపద్యపాద ము. ఇతరముద్రితములఁగూడ నీపాఠ మిట్లే యున్నది. ఏలూరిప్రతి యందిట:—

"జృంభితతదో)ష భాష చెవిఁ బడునంతన్" అని యున్నది. నూత నముద్రిత మీపాఠమునే గ్రహించి యతి సవరించికొన్నది. (చూ ౫. ౫౭ గ్రం.)

(8, "అనఁగఁ దన్మూల మెట్టిదియొ యనఁగ, (౫. ౫ ౮. అని వావిళ్లసరస్వతీప్రతుల పాఠము.) దీనిని మల్లాది వారిప్రతి

"అనఁగఁ దన్మూల మెవ్వతియొ యనఁగ,, (౫. ౬౪ మ. గ్రం) అని సవరించినది. ఈపాఠము తిరుపతి యేలూరిప్రతులందు న్నదే. దీనినే నూతన ప్రతియు గ్రహించినది. ఇది సీసఖండము,

9, "తెలినవ్వ్వడాలముకు త్రియపుఁజొక్కట్లఁ బెంకఁగ నర్మసచివు తో నరస మాడు. గీ. ౧౧౩ వావి. అని వావిళ్ళవారి పాఠము. ఇది సీసపద్యపాదము దీని రెండవభాగమున యతి చెడినది.

"పెం, చఁగ నర్మసచివుతో నరస మాడు, అని సరస్వతీ ప్రతి పాఠము. ఇటవర్తిల్లము చేయుటం యతి సరిపడినది. మల్లాదివారిపాఠమును గూడ నిదే (చూ గీ. ౧౨౧ మ) కొత్త ప్రతియు పై పాఠమునే గ్రహించినది. (చూ గీ. ౧౨౧ కొ.) ఇట్లు వర్తిల్లము చేయుకుండుట నీ కావ్యమునఁ బలుతావులఁ గలదు.

10. "ఉ,య్యాల నడి యూఁపు చోఁ గువలయాధిపు పాటలు..." ౬. ౧౯గీ. వావి. సరస్వతీపాఠములు స్వరమైత్రి లేక యున్నవి. ఇది యచ్చుత వృత్తి యనుకొన్నను సరిపడదు. చంపకవృత్తపాద మిది.

"ఉయ్యాల నడి......కువలయాధిపు పాటలు" అని నూతనప్రతి సవరించుకొన్నది. మల్లాదివారిప్రతిగూడ నిట్లే యున్నది. (చూ. ౬. ౧౯౬ కొ. ప్రతి)

11. గుజ్జనగూళ్ళ చ్చనగండ్లు పింపిళులు కుచ్చెళ్......" (౬. ౨౦౨, మల్లా.) ఇట స్వరమైత్రి లేమి యతి చెడినది. ముద్రణ ప్రమాద మనిన ననవచ్చును. బయలు సరస్వతీప్రతులు "గుజ్జనగూళ్ళచ్చనగండ్లు......కుచ్చెళ్..." అని గ్రహించినవి ఇందును స్వరమైత్రి చెడినది. ఇది మత్తేభపాదము.

"గుజ్జనగూళ్ళ చ్చనగండ్లు......కుచ్చెళ్..." ౬. ౨౦౨. అని వావిళ్ల పాఠము. ఈపాఠమే నూతనప్రతి గ్రహించినది. (చూ. ౬. ౨౦౩ కొ.) ఇందు యతి సరిపడినది.

12. "అనవృత భ్రామణాన్విత విలాసవిచిత్రత నొప్పు..." పూర్వ ముద్రితములందును మల్లాదివారిప్రతియందును నీపద్యము యతి లేక యిట్లే యున్నది. ఇది చంపకపాదము. విలాస శబ్దమందలి యచ్చు విరుగునది కాదు. కొందఱు దీనిని "భంగయతి" యన్ని యుండ్రుగాని,

అని యొక్క "తలావ"శబ్దమును కూర్చిరేమో చెప్పరాదు. ఇటఁగొన్నిప్రాఁత ప్రతులలో "అసదృశభూషణాసితశిలాదివిచిత్రత... ..." అనుపాఠ మున్నది. ఇట యతి సరిపడినది. అర్థపుష్టిమాత్రము లేదు. దీనికడ నేలూరిప్రతిలో,

"అపదురుభూషణాన్వితవిలాసవిచిత్రత... ..."

అని యతి సరిపడినపాఠ ముపలబ్ధ మైనది. దీనినే నూతనప్రతి గ్రహించినది. (చూ. ౭. ౧౦3 గ్రం.)

(13) "... ... పైనిడినయుం, బరపుదండలువోలె బొమలు దనర" ౭ ౧౪౪ మ. ప్ర. ఇది సీసము. దీనిఖండమున మల్లాదివారి ప్రతిలో నీయతి లేనిపాఠ మున్నది. వీరు పేజీక్రిందఁ జిత్తులో "అబ్బు రపు శ ఫ. బ" అని యతితప్పనిపాఠము నుంచిరి. బహూరిప్రతియం దిట్లే గ్రహించినది,

"అ, బ్బురపుదండలవోలె బొమలు దనర" అని వావిళ్ళవార స్వల్ప్రతులపాఠము. ఇందు యతి సరిపడినది. నూతనముద్రణ మీపాఠ మే గ్రహించినది (చూ. ౭. ౧౪౮ గ్రం.)

(14) "కోరి చంద్రుఁడు పడమట వ్రాలెఁజొచ్చె" ౮. ౨3 అని బహూరువావిళ్ళప్రతులు. ఇది గీతపాదము. ఇందు యతిగాని ప్రాసయతి గాని లేదు. దీనికడ పరస్వతిప్రతి "కోరి చంద్రుఁడు పడమటఁ జేరఁ జొచ్చె" అని గ్రహించి ప్రాసయతిగా సవరించుకొన్నది.

"అంతకంత, కోలిఁ జంద్రుండు పడమట వ్రాలెఁజొచ్చె" ౮. ౨౪. అని యతితప్పనిపాఠ మేలూరిప్రతియం దున్నది. నూతనప్రతి యీపాఠమే గ్రహించినది. మల్లాదిప్రతియు నిట్లే యున్నది.

(15) "బిరుదావళులు వందిజనులు చదువ" ౮. 3౧. మ. ప్ర. మల్లాదివా రీయతిలేనిపాఠము గ్రహించిరి. మఱియు వీ రిటఁ జిత్తులో "వందివరులు శ. ఫ బ." అని నిర్దుష్టపాఠము నత్రభాగాన నునర్చి యతి తప్పినదానిని మూలమునఁ జేర్చిరి. మిగిలినముద్రితములందు "బిరు

దావళులు వంచవతులు చదువ" అని ప్రాసయతి గలపాఠ మున్నది. నూతనప్రతియు నీపాఠమునే గ్రహించినది (చూ. ప. ౩౧. ప్రా.)

(16) "బెదరుట లేక మైదుపడిసేయక పారిరి..." ప. ౧౦౦. వా. ఈపాఠమున యతి పోయినది ఇది చంపకవృత్తపాదము. ముద్రితము లన్నిట నీపాఠ మిట్లే యున్నది.

"కన్, చెదరుట లేక మైదుపడిసేయక..." అని వేలూరిప్రతి పాఠము, ఇందు యతి సరిపడినది. నూతనప్రతియు నిద్దానినే గ్రహించినది. (చూ. ప. ౧౦౨. ప్రా.) మల్లాదివారిపాఠము నిదియే.

(17) "అద్వైతపరుల కసాధ్య మగుచు" (ప. ౨౨౦ వావి.) పై రీతి యతిలేనిపాఠము వావిళ్లప్రతి గ్రహించినది. ఇది సీసపాదకళికము. "అద్వైతపరుల కప్రాప్య మగుచు" అని బహూరిసరస్వతీప్రతులు గ్రహించినవి. దీనినే నూతనప్రతి గ్రహించినది. (చూ ప. ౨౨౬. ప్రా.) మల్లాదిప్రతియు నిట్లే యున్నది.

(18) "...స, హృత్పదళాబ్జపద్మంబునందు. (ప. ౨౨౮. వావి) ముద్రితప్రతు లన్నిట నీరీతి యతితప్పినపాఠమే యున్నది.

"స, హృత్పదళాబ్జపద్మాంతరమున" (ప. ౨౨౬ మల్లా.) అని మల్లాదివారిపాఠము, ఇట యతి సరిపడినది.

"...స, హృత్పదళాబ్జమధ్యంబునందు' 'అనివేలూరిప్రతిపాఠము ఈపాఠమును నిర్దుష్ట మగుటచే నూతనప్రతి దీనినే గ్రహించినది (చూ. ప. ౨౩౪. ప్రా.)

"కలఁ గలభాషిణిని విడకే చనంగ." 3. ౧౩౨. ప్రా.

"కలం గైదువు గదు వేమియును లేకే యిమ్మాయి నృత్తురే ?" 3. ౧౨౭. ప్రా,

ఈపై పాదములలోనియతులం దొకచోట నవధారణార్థకస్వరము విరుగుచున్నది. రెండవకడ నఖండముగా నున్నది. ఇవి యఖండయతులు అవి ప్రాంతరిపూతము కాని యవధారణార్థకస్వరముతోఁ గలసినట్లు

అఖండముగానే భావించి యఖండాక్షరముతో యతినిలుపుట భారతాదిప్రసిద్ధము.

"...దరికొని తెగఁగాల్చునట్టిదయ యగుఁ జూమ్మా."

భార. ఉద్యో. ౨. ౧౯౬.

'ధర్మమితరం, గదనకర్మ మొల్ల మదిగాఁగదిగా మును సొచ్చుచుండి... ,, భార. విరా. ౧ ౧౭౯

కాఁగా నిట్టి యఖండయతు లనుట కవకాశము లేదు. ఇట్టి పట్టులం దఖండముతో యతి నిలిపినవి ప్రాచీనులలో గానరావు. పూర్వయతియాదర్శకవి చెప్పి చూపినవానిలోఁగూడ నిట్టివి కానరావు కాఁబట్టి యియ్యవి ప్రామాదికములే యనఁదగును.

---

# నన్నెచోడుని వర్ణనానైపుణి.

చిలుకూరి పాపయ్యశాస్త్రి.

---

సంస్కృతకవులు రసపరతంత్రులు. వారు తమకావ్యములలో నితివృత్తము నితిహాసపురాణముల నుండి సేకరించియు రసానుగుణముగ నటలేని యంశములను గొన్ని క్రొత్తగఁ గూర్చియు, నటనున్నవానిఁ గొన్నివదలియుఁ గావ్యమున నూతనవికాసమును జేకూర్తురు. రసపరిపుష్టి కనుగుణములగు భావములు భావశైలి మున్నగు సామగ్రులు చేకూర్చుకొని రచన సాగింతురు. తెలుఁగుకవులు వర్ణనాపరతంత్రులు. కథానుగతికముగ నష్టాదశవర్ణనలు తమప్రబంధములందు విడువక పొదిగింతురు. అందును నన్నెచోడుఁడు మిక్కిలి ప్రాచీనుఁడే యైనచో నిట్టి వర్ణనల కాతఁడే శ్రీకారముచుట్టినాఁ డనవచ్చును. అంతకుముందు వెలసిన పురాణానువాదములు నిట్టి వర్ణనలు లేనేలేవనుట మాత్రము గాదు. ఉన్నను ప్రాధాన్య మింతగ వహించియుండలేదు.

ఈ ప్రసంగమున మన మొక్కమాట చూచుకొనవలసి యున్నది. అర్వాచీనప్రబంధకర్తల కృతులన్నిటిలోను పురవర్ణనము సూర్యోదయ సూర్యాస్తమయవర్ణనములు, చంద్రోదయ చంద్రాస్తమయ విరహవర్ణనములు, మృగయావర్ణనము, నాయికానాయకుల పాదాదికేశాంత వర్ణనము మున్నగునవి తప్పక చూపట్టుచుండును. ఉత్తమకవుల కృతులలో మాత్ర మావర్ణన లొకదానికంటె మఱియొకటి వేర్వేఱై చూపట్టుచుండును. అట్టివేర్పాటు నొసఁగునవి ఆయాపట్టుల నాకవు లుపయోగించిన భావపుష్టి తదనుగుణమగు భాషాపుష్టియును

ప్రబంధకవులు ప్రకృతిదృశ్యములఁ జిత్రించుటలో సిద్ధహస్తులే కాని ప్రకృతికాంత నలంకారభరితగా నొనర్చి కలకలలాడు నామెసౌభాగ్యము మనకన్నులకుఁ గాన్పింపఁజేయుదురు. అంతియకాని యామె నగ్న సౌందర్యమును ప్రదర్శించునలవాటు వారి కెప్పటికిని లేదు. వేయేల?

భారతీయసంస్కృతిలో నగ్నస్వరూపమును బరికించుటగాని, దానిని గాఢంతగాఁ జేసి వర్ణించుటగాని నాఁటికి నేఁటి కవ్యాకిని గాన్పింపదు. సముచితాలంకారభరితమై నిగూఢమైన ప్రకృతిశోభను తాము కళలారఁగాంచి యానందించి, భావనానమున్మేషమున దాని నితరులకుఁ గాన్పింపఁజేసి సహృదయహృదయముల నానందింపఁ జేయుటయే భారతీయకవుల కాదర్శము.

ఇఁక మనకవిరాజశిఖామణి యట్టి ప్రకృతివర్ణనము నెట్లు గావించియున్నాఁడో కొంచెము పరిశీలింతము. పార్వతి హిమవత్పర్వతమునపైఁ దపము నతితీవ్రతతో సాఁగించుచుండ షడృతువులు క్రమముగఁ బ్రవేశించి వానివాని వికాసమును బ్రదర్శించినవఁట. ఆఋతువర్ణనాప్రస్తావమునందలి యారంభపద్యము లన్నియు నించుమించుగ నొకరీతిగ నున్నవి. ఇది యాతని కవితాశిల్పమునం దొకవైలక్షణ్య మనవచ్చును.

మ. గతసంతాపము శీతలీకృతమహీకాంతాంగము... ...ర
మ్యతరంబై కుతలం బనం బరగె వర్షారంభ మత్యున్నతిన్.

కు. సం. ౬ ౭౫౧

మ. దళితాంభోరుహపత్రత్ర సుమహాత్కాశానాథుంబు... ఖ
గ్గలమై పర్వె జగంబులం దురుశరత్కాలంబు రమ్యాకృతిన్.

కు. సం. ౬ ౭౬౯.

ఉ. శాంతదినాధిపప్రఖరచండతరప్రభము... దేశముల్ గొంచుఁ బర్వె హే
మంతము సంతతోచితమహావికార మనం గ్రమంబునన్.

కు. సం. ౬ ౬౮౩

చ. పొలుపుగ నేచి చెల్వడరఁ బూచి బెసంగుగఁ గాచి...పచ్చ న
త్యలఘువసంత మూర్వర ననంతవిభూతి నిరంతరంబు గన్.

కు. సం. ౬ ౭౮౯.

మ. స్ఫురదురుదావపావకము శోషితసింధుచయోదకంబు...
... ... ...కటునిదాఘము పర్వె భయంకరాకృతిన్.

కు. సం. ౬ ౭౯౧.

వర్షారంభము నీకవి కడుఁజిత్రముగఁ జిత్రించియున్నాఁడు. ఈ ప్రకరణమున ఋతుషట్కాంటిగంచు నీఋతువులు పెక్కుపద్యములలో వర్ణించియున్నాఁడు. నల్లని మేఘములు క్రమ్మి వానకారులు ప్రేలాడ వని, భూమి గ్రీష్మవాతాహతిచే బ్రద్దలుకాకుండ దైవముచే నిర్మింపఁ బడిన తాపింఛమంటపములవలె నిలిచినట్లు, నామంటపములు నిలుచుటకై అన్ని వైపుల నమర్చిన గుంజలవోలె నున్నవని యుత్ప్రేక్షించినాఁడు.

గీ. ధర నిదాఘవాతాహతి నెఱియకుండ
విధి తమాలమంటపము గావించె ననఁగ
నొప్పె నీలాభ్రపటలి, మచ్చుపురమునఁ
గాఱు లన నల్లనైన వానకారు లమరె.

కు. సం. ౬ ౨౧౬.

వర్షములు కురియ నారంభించి మొసురుపట్టినతటి భూమియం దెల్లెడల చిప్పగడ్డి యలముకొనఁ నది, చలిగాలితోఁ గూడినమొసురులు మొసరుకొని పడఁకింత భూమి యను సాధ్వి ఆకుపచ్చని కంబళము కప్పి కొననో యన్నట్లు భావించినాఁడు. ఈకల్పనము ప్రకృతిచిత్రము నతి విచిత్రముగఁ గాన్పింపఁజేయుచు హృద్యతర మనుకొనఁదగియున్నది. చిప్పగడ్డి మొలచినచోట వానమయమున భూమి యినుమంతయుఁ గాన రాకుండ నలుకొనసాగాన నీచు కృత్తి యొంతయు నాదిరిని వహించి యున్నది.

క. చలిగాడ్పుల మొసురులమెయి
వలిగొని ధాత్రీపురంధ్రి వడఁ బచ్చనికం
బలిఁ గవిచికొన్నవిధమునఁ
బొలుపుగఁ జిప్పరువు గవిసె భూతల మెల్లన్.

కు. సం ౬ ౨౧౨.

వానలయులవడిని ఇంద్రగోపములు (ఆరుద్రపురుగులు) నలుగ డల వ్యాపించిన నవి వానకా రనువీరుఁడు మెయిఁ గనుతనచేతిఖడ్గముచే

పాంథు లనుశత్రువులను ఖండింపఁగా వారిదేహములనుండి రాల్లునెత్తురు బిందువులు జారెనో యనున ట్లున్నవఁట.

క. కాంతు విరహము మెఱుఁగను
దొరసిఁ బాంధులను రిపులఁ దునిమినఁ దద్దే
హారుణబిందువు లొరఁగెనొ
ధారుణి నన నింద్రగోపతతి విలసిల్లెన్.

కు సం. ౬. ౭౫.

కవిరాజశిఖామణి కొల్వుకూటమునఁ దఱచుగ నృత్తగీతవాద్యముల సమ్మేళమునఁ గలుగు నానందమును స్వయముగ ననుభవించువాఁడు గావునఁ దనకావ్యమునఁ గూడఁ బలుతావుల నాట్యభంగిమలఁ గూర్చియున్నాఁడు.

వానకారురాజు కొల్వుండఁగా నకుట నెమిళ్లు నటకులు పింఛాగ్రములనెత్తి భావము చిప్పిల నాఁడినవి. అట్టినాట్యమునకుఁ దమ కేకారవము లనంతగేయములైనవి. మేఘగర్జితములు త్రివిధమ్మయిన వాద్యధ్వనులైనవి. ఇంద్రగోపములును, పద్మములును గడ్డిపరకలయుఁ గాంతులు గలిసినచోటులు పద్మరాగములు పచ్చలుఁ గూర్చిన రంగస్థలములై యొప్పినవి.

శా. ఆగ్రీష్మాంతరపురాజు మ్రోల నిజరావానంతగేయాత్రనా
దైకాతోద్యముఁ గూర్చి మ్రోయ సురగోపాంభోజరాగత్వణా
సీకోద్యద్ధరిదశ్మకస్థల మనన్న ప్రత్యూరురంగస్థలిం
గేకిపాత్రము లాడె భావముగ సుత్రిప్తాగ్రపింఛంబులై.

కు. సం. ౬. ౭౬౦.

ఈకవి వేఱొకచోఁ బ్రదర్శించిన నాట్యభంగిమయుఁగూడ ప్రశంసితము.

మ. గళనాదంబులు మంజుగానములుగాఁ గాంచీలసత్కింకిణీ
కలనాదంబులు నృత్యవాద్యములుగాఁ గాంతోరుకోద్భుత

స్థలరంగమ్ములఁ గాముఁ డన్నటుఁ డొజ్జ గూడ నాడింపఁగా
లలనాపాత్రము లాడి రొప్ప రతిలీలాలాస్యలోలాస్యలై.

హ. వం. ౫ ౧౮౦.

అట్టివర్షాసమయంబునం దంభోవాసినియై గౌరి ఘోరతపంబు సేయునవసరంబున నంత మైనయామె యడలపై గ్రొత్తనగు జలకణములు దగిలి నిక్కిలి వన్నెయౌటె, యా యుమాదేవి యాచరించుతపమునకు డెందముల మెచ్చి దేవతలు నృత్యములు సేసలు చూపించిన ట్లొప్పెనని.

క. అమర నటీజనంబుపై ను
త్తమరుచినవజలకణములు దగిలి బెడంగై
యుమతపమున కెద మెచ్చి త
దమరులు నృత్యములు సేసి లలితసభాంగిన్.

హ. వం. ౬ ౨౬౬.

తదనంతరమున శరత్కాల మగ్గలమై జగములఁ బర్వెను. ఆశారదవేళ వికసించిన పద్మములయుఁ గలువలయుఁ గాంతులు, ఆవలకు జలమునఁ బవ్వళించిన హరియును లక్ష్మియును వర్షరాత్రులతుదిని మేలుకొని కన్నులు విప్పి వారో యనున ట్లొప్పారెనని. హరి యరవిందాక్షుఁడు, యిందిర యుత్పలాక్షియుఁ గాన నీయుత్ప్రేక్షయు నొప్పియున్నది.

క. జలశాయులైన హరిల
క్ష్ములు వర్షనిశావసానమున మేల్కాంచి క
న్నులు విచ్చి చూచినట్టులు
జలజోత్పలరుచులు వొసఁగె శారదవేళన్.

హ. వం. ౬. ౨౨౦.

ఉ. చారునిశీథినీవిమలసాంద్రసుధాకరభాతి రోదసీ
పూరితమై దినంబుల నభోమణిదీప్తిఁ దలంకఁ జేయ్మగాఁ
జేసి ఘనీభవించె ననఁ బెల్లుగసె న్నితమేఘమాంసలం
బేరుహశారసంహతులు గ్రిక్కిఱిసెన్ శరదాగమంబునన్.

హ. వం. ౬. ౨౨౩.

ఆశరత్కాలవేళ రాత్రులందలి స్వచ్ఛమై దట్టమైనచంద్రకాంతి భూమ్యాకాశములను నిండినదై పగటియందలి దినమణిదీప్తిచే వ్యాపింపఁజాలక పేరుకొని ఘనీభవించెనో యనునట్లు తెల్లని మేఘములు హంసలు పద్మములు తెల్లపూలు క్రిక్కిరిసిపోయె నని కవి యుత్ప్రేక్షించినాఁడు.

అంతియగాక ఆవిరిసిన తామరపూవులతావి నాఘ్రాణించుటకు పండినశాలిసస్యముల నొంగించినాఁడు.

క. శరదాగమమున శోభా
కరముగఁ గైవ్రాలఁ బండి కలమవనంబుల్
గరువున నెఱిఁగఁ దామర
విరిపువ్వులతావి మూఁగువిధమునఁ బొలిచెన్.

కు. సం. ౬. ౭౭౬.

ఈకల్పనమునకు మూలము కిరాతార్జునీయములోని యీక్రింది శ్లోకము.

శ్లో. అమీ పృథుస్తంభభృతః పిశంగతాం
గతా విపాకేన ఫలస్య శాలయః
వికాసివప్రాంభసి గంధసూచితం
నమన్తి నిఘ్రాతు మివాసితోత్పలం.

సం. కిరా. ౪. ౨౬.

నన్నెచోడుఁడు కృత్యాదిని గవిస్తుతిలో భారవిని,

క. భారవియు వస్తుకవితను
భారవియును బరగి రుదయపర్వతశిఖరా
గ్రారోహణేంద్రకీలన
గారోహణవర్ణనల జనారాధితులై

కు. సం. ౧. ౨౦

అని పేర్కొని అర్జునుఁ డింద్రకీలపర్వతము నెక్కివిస్తావమునం దలి శరత్సమయవర్ణనమును దాను గొంతవఱ కనుకరించినాఁడు. ఈక్రింది పద్యమును గొంచెము మార్పులతోఁ గూడినది యట్టిదే.

ఉత్సాహ. అరుణశాలికణిశములు శుకాలి గఱచుగొనుచు నం
బరతలమున నోలి నెగసి పాఱు దిగ్విధూచయం
బరయఁ జెలువ మెసఁగు శారదాగమమున నుత్సవో
త్కర విభాతిఁ దోరణములు గట్టినట్లు లుండగా.

కు. సం ౭. ౭౭౭.

చిక్కులనెడి స్త్రీలు అందముతోఁ దులతూగెడు నాశరత్సమ యమున ఉత్సవములు పాటింపఁ దోరణములు కట్టినట్లుల చెలువ మెసఁగ శుకాళులు నోట నెఱ్ఱనైన పతిపత్త్రులు గఱచుకొని యాకసమున బారు లుగట్టి వరుసగ త్తినవి. కిరాతార్జునీయములో నీభంగి యున్నది.

శ్లో. ముఖై రసౌ విద్రుమభఙ్గలోహితైః
శిఖాః పిశఙ్గీః కలమస్య బిభ్రతీ
శుకావలి ర్వ్యక్త శిరీషకోమలా
ధనుశ్శ్రియం గోత్రభిదోఽనుగచ్ఛతి.

సం. కిరా. ౪. ౩౬

వికసించిన దిరిసెనపువ్వువోలె మృదువైన యాచిలుకగాలి పగడపుఁ దునుకవోలె నెఱ్ఱనైన ముఖములచే పచ్చనగు కలమాగ్రములఁ గఱచి కొనుచు నాకసమున నింద్రధనుశ్శోభ ననుకరించుచున్నది. ఆచిలుకాలి నూఁతగఁ గొనియే మన నన్నెచోడుఁడు తోరణములఁ గట్టించినాఁడు.

శరత్కాలము తన కూఁతునకు భరింపరానితాపము గలిగించు చుండుట గాంచి హిమభూధరాధిపతి శరద్భతువుపై దండు వెడలెనో యనునట్లు మంచు తెలతెలవెడల వ్యాపించెను.

౫. శరదాగమంబు లీవనుత

మునుమరితాపంబు సేయుచుండుట. హిమభూ

ధరకతిఁ గని వానికయిం
బఱిగొనియునొ నాఁగఁ దుహినపటలము పర్వెన్.

కు. సం. ౬. ౧౮౦.

అట్టి హేమంతసమయమునఁ బద్మములన్నియు నణఁగి పోయెను. పోఁగా కొలను విత్తనములకై తన కొక పుష్పమాత్రము దాఁచుకొనిన ట్లుదకము దాఁడి తప మాచరించుచున్న పార్వతి ముఖ మలరారెను. మఱియు మంచు వ్యాపించి పద్మము లన్నియు వాఁడిపోఁగాఁ గొలనులో నీరొక్కపూవే నిల్చినది; దీనికిఁ గూడఁ జేటు వాటిల్లునేమో యను భయముచేఁ దమ్మిద లన్నియు గుమిగూడి యడ్డు నిల్చెనోయనునట్లు లాయుమాదేవియుం దాననముపై జడలగుంపు పెనవేసికొని యొప్పెను

గీ. తనరి హేమంత మనుడుఁ బద్మము లడంగి
పోయెఁ బో యనఁ గొల నొక్కపుష్ప తనకు
విత్తుగా దాఁచుకొనియున్న విధము పోలె
శైలసుతవదన ముదకవాసమున నొప్పె.

కు. సం. ౬. ౧౮౪.

చ. వనజములెల్ల మంచుగొని వాడినచో నొకపువ్వు నిల్చినం
గని యళులన్నియున్ స్నేహవృత్తిఁ గొని దీనికి మృత్యువచ్చునో
యనుచుఁ దమీఁదఁ బిండుకొని యడ్డము నిల్చెనొ నాఁగ నంబుజా
ననముపయిం జటావలి పెనంగి నగాత్మజ కొప్పె నత్తఱిన్.

కు. సం. ౬. ౧౮౫.

ఇట్లతిదుర్వహశీతోద్వేగంబగు హేమంతశిశిరంబులందు నిరంతరోదకవాసనిరాహారాది ఘోరతపోవృత్తిఁ బ్రవర్తించుచుండునంత— అని హేమంతముతోపాటు శిశిరమునుఁ గూర్చినాఁడేగాని ప్రత్యేకముగ వర్ణించియుండలేదు. అటులనే ప్రకరణాంతరమున వసంతమును విపులముగ వర్ణించియుండుటచే నీప్రకరణమున నావసంతశోభ నంతగఁ జిత్రించియుండలేదు. కాని వసంతమును వర్ణించినట్టున భావసామ్రా

ష్యము నధిష్ఠించి విలక్షణమైన శోభఁ గనఁబఱచినాఁడు. ప్రకరణాంతరమున నా ప్రసంగములఁ గాంచెదము.

అంతఁ బార్వతి వసంతానంతరతాఁ దనంతతి సంతతాక్రాంత పూజాత్యంతదేవతాదిక్రియలం బ్రవర్తించుచుండునంత నిదాఘము భయంకరాకృతితోఁ బర్వెను. ఆగ్రీష్మముఁ దలఁచినఁ దొండము కందును; పలికిన నోరంతయుఁ బొక్కిపోవును. అతని సిరి చూచినచో రెప్పలు కమిలి పోవును. ఇట్టులా వేసవిని ప్రళయానలము రీతి నెండ గాచెను.

క. తలఁచినఁ దొండము గందును
 బలికిన నోరెల్లఁ బొక్కుఁ బ్రభ సూచిన రె
 ప్పలు గమరు వసఁగఁ బటుతర
 విలయానలభాతి నెండ వేసవిఁ గాచెన్.

☛ సం. ౬. ౭౯౨

ఇట్టి తీవ్రమైనట్టి గ్రీష్మాతపాహతిచే నేనుఁగులతలలు పగిలి క్రమముగ లోపలి ముత్యములు చిటిక మంగలములో వైచిన పేలాల రీతిని తూలిపడునట్లుగా బిట్టెండ గాసెను

గీ. ఉరునిదాఘాతపాహతిఁ గరులతలలు
 వ్రస్సి లోపలి ముత్యముల్ పరుస వ్రీసి
 మంగలములోని ప్రేలలభంగిఁ దూలి
 ప్రేలిపడఁ గాసెఁ గట్టెండ పిసువరించి.

☛ సం ౬. ౭౯౩.

ఎండవలని భయమున నీడలు చెట్లక్రింద దూఱెనో, లేక యా వృక్షములు దప్పికచే పీడింపఁబడి తమనీడలు తామే త్రాగెనో, యన నట్లాగ్రీష్మసమయమున మధ్యాహ్న వేళల నెండలు చలింపక యుండ నీడలు పెద్ద పెద్ద చెట్లమొదళ్లయందే యణఁగియుండెను.

ఉ. ఆతపభీతి నీడలు రయంబున భూరుహముల క్రిందు దూఱెనో
 భూరుహులుం దృషాభిహతులై తమనీడల దార త్రాగెనో

ఈకవి ప్రభు వగుటచే భావప్రదర్శనమున నైతము తన ప్రాభవము కాన్పించఁజేసినాఁడు. మన్మథప్రభువు తుమ్మెదలు చిలుకలు కోకిలలు అను తన సేవకవర్గమునకు ప్రతిదినముఁగ వేతనము నీయ బైటఁబోసిన బంగారుప్రోగులోయనఁ బద్మము లందమై పూచెను.

క. భావజవిభుఁ డలిశుకపిక
సేవకతతి కొడయ దీల జీతముసేయం
గా వెలఁబోసిన పసిఁడుల
ప్రోవులునాఁ దమ్మి తెలమిఁ బూచె పెడంగై.

కు. సం. ౮.౮౮౩.

ఆవసంతసమయమునఁ గంకేళి పూచి తుమ్మెదలచే మూగఁబడిన పాంథవర్గమునకయి మన్మథుఁ డభిచారక్రియ సల్పకుండమధ్యమున దగిలి పొగతో నైతగయు నగ్నివోలె నొప్పెను. కంకేళిపూ లెఱ్ఱఁగను నళులు నల్లగను వ్యాపింప నాభిచారికాగ్నితోఁబోలిక యేర్పడెను.

గీ. పొలిచె మధువేళఁ గంకేళి పూచి భృంగ
పరివృతమ్మై మనోజుండు పాంథతతికి
నాభిచారంబు వేల్పఁగుండాంతరమునఁ
దగిలి కామాగ్ని పొగలతో నెగయునట్లు.

కు. సం. ౪. ౮౯౦.

విరహిజనహృదయములను శిథిలముచేసి మన్మథుఁడు రాక్షసవృత్తితో నాయుధములనూడఁ బెఱికి చేతఁబూనెనో యనునట్టు లెఱ్ఱకరవీరము లొప్పెను. పూవు లెఱ్ఱగ నుండుటచే నవి రక్తసిక్తాగ్రములవలెను, వానికి వెనుక సన్నరేకులు ఆయుధములకు వెనుక నుండెడి త్రాళ్ళవలెనగిది నుండుటచే నిట్టి కల్పన కూర్చియున్నాఁడు కవి.

క. విరహిజనహృదయంబుల జ
ర్జరితంబులు చేసి మరుఁడు కరకత్త్రములు లా

నగరిపునీలజాలములు నాఁ దనరారె వసంతవల్లభుం
డను వలరాజు పంచమణిహర్మ్యములో యనఁ జూతభూజముల్.

కు సం. ౪ ౪౭౬.

చూతవృక్షముల నీకవి వలరాజు వసించుటకు నిర్మింపఁబడిన యైయిదువిధములగు మణులచే ఖచితమైన మేడలవగిది నొప్పారఁజేసినాఁడు. మొగ్గలు వజ్రములు, పూవులు, ముత్యములు, ఇంపైన సన్నని లేఁతచిగుళ్లు పద్మరాగమణులు, చిలుకలు పచ్చలు, తుమ్మెద లింద్రనీలమణులు. ఇట్లు వసంతవల్లభుఁడైన వలరాజు నివసింప నర్హమగు మణిఖచితహర్మ్య మేర్పడినది.

మఱియు నీయామ్రమె యొక్కటియే మనసిజునకు నయిదువిధములయిన యస్త్రములు సంపత్తిని జేకూర్చినది. అంకురములు చిగుళ్ళు మొగ్గలు పూవులు ఫలములు క్రమముగా ఉన్మదన మదన మోహన సంతాపన వశీకరము లనఁ దనరారిన యస్త్రము లైనవి.

క. చన నున్మదన మదన మో
హనసంతాపనవశీకరాస్త్రము లన హృ
జ్జనునకు నంకురపల్లవ
ఘనకోరకపుష్పఫలనికర మామ్రములన్.

కు. సం. ౪ ౪౭౬.

ఘనసహకార భూరుహచక్రవర్తియే యొకతరి శంభుమూర్తిదాల్చి యాకావ్యమున విలసిల్లి మనోజుని ఉదరిపడి రోమాంచిల్లఁజేసినాఁడు. మఱియు నీసహకారమే వసంతసంగతిఁ బరాంగియై యొప్పి, పూవులను మంచుకొనములతో, మత్తిల్లిన తుమ్మెదలమధురగాన మను తీయనిపాటలతో, రాచిల్కలపలుకులను ముద్దుమాటలతో, చన్నగుకల్లవరాగ మనురాగముతో, కోకిల కుహూకార మనుమధురనాదముతో, నెమిలి పింఛములను రేకజాలముతో, రాలిన పుడుటాకులను మొలకాలితో నొప్పు చూతఁదగిన విలాసమ్ముఁ దాల్చెను.

ఈ విలాసవతి నిట్టి నూతనాలంకారములతో భూషించి ప్రదర్శింపఁజేసిన కవివతంసుని ప్రతిభ సుశ్లాఘ్యము. ఇట్టి వసంతము కవివతంసుల కావ్యములందెక్కడఁ గానరాదు.

చ. అలరుల మందహాసమున నన్నినషట్పదమంజుగీతి రా
చిలుకలముద్దుమాటలను జెందలిరాకులరాగలీలఁ గో
కిలనినదంబులన్ బరిహాసకేళిభరంబున మౌక్తవర్ణమే
ఖల నభిరామమయ్యె సహకారలతాంగి మధుప్రసంగితిన్.

కు. సం. ౮. ౮౯౮.

ఇంతియె గాక యీ సహకారము వసంతసంగతిని వలరాజును బోలి యొప్పెను. చిగురుగొడుగుతో పుష్పబాణములతో, బలిసిన కోకిలలు చిలుకలు తుమ్మెదలు అను పరివారముతోఁ గూడ నట్టి సామ్య మేర్పడినది.

క. తలిరల్లిఁ బూవుటమ్ముల
బలిసిన పికకీరభృంగపరివారముతో
వలరాజుఁ బోలి మామిడి
సలలితగతి నతవసంతసంగతి నొప్పెన్.

కు. సం. ౮. ౮౯౯.

ఇఁక మలయపవనము తుమ్మెదలు చిలుకలు కోవిలలు గావించిన విలాసములు విహారములు కడు హృద్యములు. ఆప్రకరణమునందలి శైలి హృద్యతరము. భావము లన్ననో కడు మధురములు. విస్తరభీతిచే వదలినాఁడ.

కాని యీ మధుసమాగమున సోలుచు, ప్రమోదరసమునఁ గ్రాలుచు వనమును పాలనసేయు బాలికలు నవనవలాడెడు తీఁగ యుయ్యాలల నూఁగుచు క్రొత్తక్రొత్తపోకడల రాగాలాపములు చేసిరి. వారి పాటలతోఁ గలిసి పాడిన మధురగానము గావుననే నన్నెచోడుని వసంతము ప్రాక్తనమైనను నూతన మనిపింపకపోదు.

క. పోలుదు సమ్మదరసమునఁ
గ్రాలుచు వనపాలబాలికలు నవలతికాం
దోలికల నెక్కి సలుపుచు
నాలతు లాగిఁజేసి పాడి రభినవలీలన్.

కు. సం. ౪. ౪౬౮.

ఇంకను నీరీతిగ భావభరితములగు వర్ణన లెన్నియో కావించి యున్నాఁడు. ప్రసంగాంతరమున వాని నరసెదము గాక.

నిరంతరపంచాక్షరీమంత్రజపధురంధరుండును, పర్ణజలాహారుండును, నగుచు ననేకవత్సరంబులు సలుపుచున్నయెడ, జాజ్వల్యమాన భక్తవాత్సల్యసమీరప్రేరితుండును, వినిద్రరుద్రగణదేవజయావధారణ ...భయదగర్జానాదంబును, నపారకృపారసోత్కర్షవర్షంబును గలిగి మించినమహేశ్వరధారాధరంబు చనుదెంచి, నిజమనోరథంబునకు నంకురంబు లెగయ సన్నిధి చేసినం గని పెన్నిధిఁ గన్న పేదచందంబున మిన్నందుచు నప్పద్మభవకుమారుండు విరచితతదీయచరణనమస్కారుండై, ౧౬౩

క. భవదంఘ్రులు భజియింతును
భవభయభరభంజనప్రభావాస్పద
...వరశశిభాసమానా
భవనితధరగర్భభాగ ఫాలాక్ష శివా! ౧౬౪

క. జయ [1]జనకిసకలలక్షణ
జయ జననవినాశదూర జగదేకనిధీ
జయ జటిరాపకవారీ
జయ జంగమతత్త్వరూప జలజాక్షనుతా! ౧౬౫

క. నాయందుఁ బ్రసన్నుఁడ వగు
మాయాతిదయాత్మోద మంగళాయతనగుణ
ప్రాయాచరిత విశ్వంభర
నీయడుగులు భక్తిఁ గొలిచి నెగడుదు నెమ్మిన్. ౧౬౬

గీ. అని నుతించుచున్నయాదక్షుఁ గని శివుం
డలఘుకరుణ మించి యాదరించి
యొట్టిదేని యడుగు మిచ్చెద నిచ్ఛాప
[2]లంబు నీకు నభిమతంబు గాను. ౧౬౭

వ. అనిన విని యతం డధికప్రమోదంబునఁ గ్రమ్మఱఁ బ్రణామంబు సేసి మోడ్పుఁగేలు ఫాలపట్టికం గదియించి, దేవా! భావనాతీతుండగు

1. జనకలలక్షణ. 2 యంగ.

నిన్ను దర్శించినప్పుడ నా ప్రార్థించినయర్థంబులు కృతార్థంబయ్యె నని
నిర్ణయించితి తద్భంగి యవధరింపుము. ౧౬౮

క. పతి యనఁగ సన్మతాత్మజ
యతిశయగుణరూపభావవాఁవనవశతా
పతిగల దాపతి శోభన
గతి మీ కర్పించు బుద్ధి గంటిని శివా! ౧౬౯

క. మత్ప్రార్థన మీయర్థము
తత్ప్రతిభాయత్త భక్తజనరక్షాశ
శ్వత్ప్రాభవ యీశ్వర యే
తత్ప్రకటవరంబు నాకు దయసేయఁ దగున్. ౧౭౦

ఉ. నావిని యవ్విభుండు వదనంబునఁ గొండొక నవ్వు దేఱఁగా
నావనజాసనాత్మజున కానతి యిచ్చె నితాంతమంగళ
శ్రీ విలసిల్ల నీతనయఁ జిత్తమునం జిగురొత్తు వేడ్కతో
నే వరియించెదన్ భవదభీప్సితసిద్ధి ఘటించునట్లుగన్. ౧౭౧

వ. అదియును నతిశీఘ్రంబున సముహూర్తంబుకయెను; నారదుల్లు మరుచుం
బలికి యతని వీడ్కొలిపి, తానును మరలి, రజతాచలంబున కేగి,
తగువారిచేతం బెండ్లిపనంబు దత్తున కెఱింగించి పుచ్చి, సము
చితంబుగా నమూల్యగంధమాల్య ప్రముఖద్రవ్యదివ్యపుష్పంబుల
వలన నలంకారం బలవరించి, సర్వసంయమిసుపర్వసహితుఁ డగుచుఁ
దత్సమయంబునఁ జనుదెంచి నయ్యంబుజభవవాక్యంబున నుభయ
పార్శ్వంబుల విస్ద్రరుద్రగణసహితుం డగుచు నిరంతరసేవాహేవా
కరతవరిసన్న కాలరుద్రదేవుండు ముందటనుం గలసి కొలువ, భార
తీందిరాచండిక లప్సరసస్త్రీలుం దారునుఁ బిఱుంద నిలిచి కల్యాణ
గీతంబులతోడ మంగళాక్షతప్రపాతంబు లప్పటప్పటికి శేఖరస్థలం
బున నలుకఁ, దుంబురునారదప్రముఖ జయవర్ధననాదంబులుఁ ద్రివళి
మృదంగకాహళపురస్సరానవద్యనినాదంబులుఁ గలసి యొక్కుమ్మడిఁ

పరిచారికలం జెప్పుదు రటుల, మంచిముహూర్తంబునం గదలి యన్వ
యంబు తద్వంశభవనాశ్రమంబు గదిసిన, బహుమానంబుగా నెదు
ర్కొని పూజించి, తయ్యెన నివాసంబున కేగి, శాస్త్రమార్గంబున
నర్ఘ్యపాద్యాదిమధుపర్కాదులు సమర్పించి, యాగకమున్న సిరియింటి
లోపలం బెట్టి తెలిమాటున మంగళశృంగారగతిం జెలంగుచున్న పతి
చేరువకుం జనిరి; నాసమయంబున, ౧౭౨

గీ. లగ్నవేళ దైవ లలితవైభవనోద్య
దమరవాద్యవాద్యతతులు ప్రమోద
వశము నున్నవారి గదలించి దవ్వరల్
తిగిచి రింపు మతుల దీటుకొనఁగ. ౧౭౩

క. తెర వాయఁ దడవ సిగ్గిలి
వెర చాయతలోచనము లిటియఁగఁ బ్రేమం
జరుదారఁ గోలఁ దొడఁగెను
హారఁ దాదరణీయభావహావస్థుఁ దనన్. ౧౭౪

చ. హరుఁ దటమున్న మంగళమయంబగునూతనమాత్ర మాదర
స్ఫురణ దృఢంబుగా మడిచె సుందరి యంతఁ దదీయహావభా
వరసవరాధిపీచికల వారని పేర్మి నిజాత్మ మానముల్
గరఁగుచుఁ బ్రుల్లుచుం బవుకళించుచుఁ దెంపున నోలలాడుచున్. ౧౭౫

వ. తదనంతరంబ యథోచితప్రకారంబుగఁ బాణిగ్రహణవిధానంబునలిపి
హోమంబు నిర్వర్తించునప్పు డోజ యగుచున్న కమలాననకుం దమ
పతిదర్శనలాలసంబగు మానసంబున హోమాగ్నిలోపలఁ బద్మ
సమిధలఁ బెట్టి ప్రకాశమంపుధూమంబు గల్పించి నిజచరితంబు శివున
కెఱుకపడకుండఁ గ్రిందుచూపుల నవ్విశ్వనాథ వీక్షించుచుండెను.

ఉ. తన్మదిరాక్షివిభ్రమము దక్కక కన్నులఁ గ్రోలఁ జొచ్చెఁ బ్రే
మ స్మరుచేత బిట్టదరి మానస మాకులమయ్యె నట్లు గ

శ్వరు రావించిన వచ్చి యాతఁడును సజ్జాతప్రభూతప్రభా
స్ఫురణం బాఁ బ్రహసించుతత్పదములం బూజించె జాటూరునిన్.

వ. తదనంతరంబు. ౧౮౨

క. అభయము శాశ్వత యీశ్వర
యభయము దివ్యప్రభావ యవ్యయ యభవా
యభయము సర్వజ్ఞ ! భవా !
యభయం బవినాశ యీశ యాశ్రితవరదా ! ౧౮౩

చ. అతిచపలస్వభావమున నాంగికవాచికభావితోగ్రదు
ష్కృతిమయుఁడైన వాఁడ నను జేయుము శుద్ధునిఁగాఁగ లోకర
క్షితుఁ డగుబంటుఁ గాచుటయె యొందుఁ గృపాభుతగాక కల్ల ల
క్షణములుగాఁ దాని మఱి యెవ్వరుఁ గావరు విశ్వనాయకా ! ౧౮౪

క. ఏఁపు దవజ్ఞఁ జేసితి
మానసమున నంతవట్టు మఱువుము నీవే
గాని మఱి దిక్కునాకుం
గానఁగనే నెందు నిజముగాఁగ మహేశా ! ౧౮౫

వ. అనుచు బహుభంగుల సంస్తుతియించుచున్న యన్నలినాసనుతోడ
నొడలు మని యతని శుద్ధుంజేయుటకు గంగాముఖ్యపుణ్యతీర్థభరితం
బును, వసుంధరాంగకలితంబును నగు నాకకమండలంబుఁ గృప
చేసి, యలఘుసమ్మదవిలాసుంగా నలవరించి, యశేషంబుగా రమ
ణీయవేషంబు దీర్చి, యభినవవాభినయశకస్యంబులగు వస్త్రరోలా
క్యంబు లాదరించి, యిట్లు నిజవివాహోత్సవంబునఁ ద్రిభువనంబు
లకుఁ బరితోషం బాచరించి, యుల్లసితవిలాసవతియగు సతిఁ గరాం
గుళి నలవరించి సవ్యరత్నాభిమాన దివ్యవిమానాధిరోహణం బాచ
రించి, వల్లభాసంగవల్లవితకటాక్షనిరీక్షణశోభాయమానవిభ్రమం
బును, సురాంగనాకరచామరసమీరణదోధూయమానకుంతలం
బును, విశ్వావసు తుంబుర నారద ప్రభృతిగంధర్వగీతప్రబంధజేగీయ

యాకాశతలమున నవయంబుఁ దిరుగుట
నలఁ పూని యించుక నిలువనొక్కొ
వాంఛప్రతిచిపై వావిరిఁ బుట్టినఁ
జెలఁగి తత్సంగతి చేయనొక్కొ
తిమిరారిగానఁ దదీయాగమాశంక
దొడరిన వెసఁ గ్రుంకఁ ద్రోవనొక్కొ
గీ. యఖిలతనురాజి యపరాహ్ణ మాఁచికొనిన
నోర్వఁజాలమి ళృగుపాత మందనొక్కొ
నాఁగ మందాయమానమండలముతోడ
నస్తగిరిమస్తకముమీఁది కరిగె నినుఁడు. ౧౯౨
చ. మఱిఁ దలశోకదంపతులమర్మములన్ వ్రదళించి పాంథశీ
కరముగ నత్తిపట్టినఁ బ్రకాశము నొందెను నన్నలీల ని
ర్భరరుధిరాభిషేకపరిభాసితచక్రము వోలె నత్తటి
న్వరుణునిదిక్కునందు దిననాయకమండల మొప్పె శోణమై. ౧౯౩
క. సుమఁజుసిఁడిగుండుకేల
న్నమవిఁడిపిఱుకాఁడు మింట నార్జతమార్గం
బుననిగిడిపెట్టుపడి జవ
మునఁ దూలెడునట్లు ప్రొద్దు పొటుకునఁ గ్రుంకెన్. ౧౯౪
సీ. అలఘుకాలకృపాణహాత మగుదినమహి
షముమేనిశోణితోచ్ఛ్రయ మనంగ
యామినీభూమిక నరుదార ముంగలి
తెఱఁగార సునుదోఁపు తెఱ యనంగ
పాంథుల సేవ హృద్ఘటలీలఁ దోఁచిన
మదనప్రతాపాగ్నిమంట యనఁగ
[1] ... ... ... ... ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ...

1. ప్రాఁతప్రతిలో నిది కానరాదు.

గీ. ధరణిహయఖురాగ్ర దళనోత్థితాస్త్రాద్రి
భాగఛాయధాతుపటల మనఁగ
పరగి కెంపుచాయ పడమటిదిక్కున
వెలసె సాంధ్యరాగవిభవ మపుడు. ౧౯౫

క. ఇనుఁ డపు డురురుచి విధివశ
మునఁ బోయిన యట్టిపిదపఁ బో నంగనలుం
జనుటయు తగ దని సంధ్యాం
గన యురురుచి యనుకరించె ఘనరాగమునన్. ౧౯౬

సీ. విరహుల మర్మముల్ వివిదళింపఁ గరసాన
వెలఁచిన మరునస్త్రగుళికలయనఁగ
రాజు రాఁగలఁ డని రజని ముంగిట నిడ్డ
ముత్యాలసన్నముగ్గుమొగడ లనఁగ
దినకరము క్రస్సి యిలఁ బడు నభ మని
నలువ దాఁచిన వెండిమొ॰ లనంగ
కాలభైరవయోగి కంఠకీలితములై
మనరూరు నవశంఖమణు లనంగ
దివిజనదిలోనఁ దిరిగెడు దిగ్గజములు
త్రుంచివైచిన తెల్లనితొగ లనంగ
తారరుచి మింట నంతటఁ దార యగుచుఁ
గరముఁ జెలువొందు చుక్కలు కలయఁబొడిచె. ౧౯౭

క. తా రాన్నకేవజగ్రిన
నారభటీసరణి నచ్చినట్టికరణిఁ జె
న్నారెం దమ్ముల మండా
కారము లగునంధకారకాకోఘంబుల్. ౧౯౮

గీ. శీతకరుఁడు నపుడు చీకటి మీఁద రాఁ
దలఁచి ఋణశ జాతీకాని కరణిఁ

పూర్వశిఖాఁ గళలఁ బోల్చి షోడశకళా
పరమితిఁ దోడఁగ నీరజాక్షి సేయు. ౧౯౯

సీ. నీలపయోధరుచానురక్తమధ్యమదిశా
పతిరత్నమయపానపట్ట మనఁగ
మృగనాభితిలకసమ్మిళితఫాలము దిశా
రమణీభాస్వద్వక్త్రకమల మనఁగ
చూచుకముద్రాభిశోభితం బగుదిశాం
గనకుంకుమారుణస్తన మనంగ
హరినీలమణికందుకాంచితం బగుదిశా
యువతిపాణితలపల్లవ మనంగ

గీ. పూర్వశిఖాఁ దోఁచెఁ బొంపొందు గందు దో
రంపుఁగెంపు దాను సొంపు మిగుల
వితతపద్మదోస్తు విశ్వంభరామోద
మండలంబు చంద్రమండలంబు. ౨౦౦

క. ప్రియవనిత(మ)దనకళలన్
రజనిముఖముఁ దగిలి చుంబనము సేయుచు నా
ద్విజరాజు రాగవశమున
నిజకరములు చాపి పట్టె నెఱి నంబరమున్. ౨౦౧

సీ. మొనమొగ్గరంబున మొఱయుచీకట్లను
[1]కప్పఁబట్టి బట్టి మల్లాడియాడి
దండగాలుగనుండి తఱిమి చీకట్లను
గ్రొవ్వఁడా(నొవ్వఁ)గొట్టిగొట్టి
[2] (వెసమీఱ)కెళవున వెలయుచీకట్లత్రు
ళ్ళణఁగించి త్రుంచి తూటాడియాడి

1. తోఁబట్టమిట్టి.
2. కళవుర వెలయుచీకట్ల త్రుళ్లణఁగించి
వెసఁద్రుంచి త్రుంచి తూటాడి యాడి.

దన్నువ నల్లాంఛన మది
వెన్నెలకుం బాటి యగుచు విలసిల్లె నృపా! ౨౦౫

వ. ఇట్లు చంద్రుం డలఘుప్రభాభాసమాన విభవ నిస్తంద్రుం డగుచుండ, చంద్రికాసారంబు సారంబుగా బ్రబలి యొప్పారుచు, తక్కరియు నుంబోలె వెలిపసలు చూపుచు, మొలకచనుఁగవయునుంబోలె నిట్టలంద్రోచుచు, విఱిగిన దళంబులుంబోలె ఏటెయుం బాయుచు, తక్కరకాలునుంబోలెఁ బధిక నొంచుచు, నిధిగన్న పేదయునుంబోలె గగనంబు ముట్టుచు, మఱియు బహుళంబుగాఁ జెలంగుచుండి, మిక్కిలి తెల్లంగలిగి వచ్చుచుం బోవుచుండియు, రాకపోకల కతికి రాజద్రావున వృద్ధిపొందుచుండియు నేవంకనైననుం బట్టుసాలక సంతసంబు నం బరగి తమ్ములసిరి కోపుచుండియు, దిగ్వలయసముల్లాసంబు జరిపి బహుళుమెఱసి వెలుఁగుచుండియు, రాత్రిగాని తఱి నూవ వె లది యొల్లజనులకుఁ బ్రియంబు సేయుచుండియు, మిత్రునిఁ బాడఁగని యుర్వు డప్రసన్నత వదలి యవ్విధంబుగాక చక్రవాకంబులతోఁ గైరవానీకంబులు విచ్చుచు, చంద్రకాంతంబులతోన కాముకస్వాంతంబులు గరఁగను, చకోరంబులతోన సాగరపూరం బుబ్బను, తిమిరకదంబంబులతో సురతవిడంబంబులు వెడలను, తస్కరాటోపంబులతోన విరహిమనస్తాపంబులు గములను, జారస్తోమంబులతోన విటవిటీ ప్రేమంబు పెరుగను, మఱియు మదనశృంగార మంత్రంబులకు వేసవిద్రవము వ్వెదెలిసె, పంచమవాద్యకుంభత్ప్రినాద మత్తైగిరియుంగణసీమ నగలించు; పూర్వాది కకుబ్బణదీప్తప్రవాళవల్లవోల్లాసపంపదఁ బరిఢవించు. ౨౦౬

చ. సనకసనందనాదు లగుసన్మును లుల్లములం బ్రసన్నతా
ఘనత దలిర్ప శంకరునగారము సుందర నిల్చి భక్తితో
సనఘువిభాతకాలవరవార్థనవార్థగభీరశుద్ధతిన్
మున మున కింపు సేయువచనంబులఁ బ్రస్తుతిచేసి రాత్రులన్. ౨౦౭

గీ. అతులయాత్రిలీల నామ్నాయములఁ బ్రజ
వాదు లగుచు నవ్వ దర్శితోడఁ
బొగడ నంబికాపిభుని భూతభావి
యాభిధానగుణమహాత్త్వములను. ౨౦౮

గీ. ఇపుడు విచ్చేయు నీమ ప్రాణేశుఁ డనుచు
బాసఁగ రవిరాక యెఱిఁగింపఁ బోయినట్టి
దూతికయుఁబోలె నత్తఱిఁ దొగలనుండి
కణఁక నళిరాజి పద్మినిఁ గదిసియుప్పె. ౨౦౯

సీ. కలువలకొంగ జక్కవలకోర్కులపంట
నిండుచీకట్లకు గుండెబెదరు
చాయలపుట్టి ప్రాఁజమవులనెలదుంప
బొంటి చ్చులపాలి వెంటిగుదియ
మహిమలకప్ప నేమములు నిల్వఁగ నీడ
యిరునాల్గుమేనుల పెనుబహాద[1]లు
తమ్ములచట్టము ధరప్రొక్కులకు నల్ల
త్రిమ్మరికత్తెల రొమ్మునరియ
దలివిసిరియిల్లు...తోనఁ దెరలువెజ్జ
తపసులకుఁ బ్రోపు చుక్కలదాడికాఁడు
చలివెలుఁగుసూను మిన్నులవెలుఁగువేల్పు
పొడుపు గుబ్బలిఁ జెన్నుగాఁ బొడిచె నపుఁడు. ౨౧౦

క. హరునకు నశేషజగదీ
శ్వరునకుఁ బొడ సూపె నదియు సమయం బంచున్
ద్వరఁ జనుదెంచెనో యనఁగాఁ
గర మొప్పను మింట నహిమకరుఁ డట్టియెడన్. ౨౧౧

సీ. తొలి దొలి యించుక మొలచి యాకలతోఁ
బరిపాటి మోసులుపాటిపాటి

---

1. [illegible]

తెఱచుగా సంతటఁ దలకొని యేపునఁ
జాజుకట్టుచు కొనసాగి సాగి
నవ్వటిల్లుచు నున్నమవ్వంపుకలిమిచే
కావ్యంబు నామడి ప్రబ్బిప్రబ్బి
నల్లతావుల నల్లిబిల్లిగాఁ బ్రాఁకుచు
నొక్కయెమ్మడి బెగడొత్తిరొత్తి

గీ. వినుతవిశ్వజనులకన్నులపండువ
యగుచుఁ గ్రొత్తగాఁగ నలమి యలమి
యంత లతయుఁ బోలె నెంతయు రుచిమీఱి
కరము మీఱి చాయ కాయఁదొడఁగె. ౨౧౨

క. అంతట మున్న మహేశ్వరుఁ
డంతఃపురి వెడలి యుచిత మగుకరణీయం
బంతయును జరిపి బాహ్యస
భాంతరసింహాసనమున నాసీనుండై. ౨౧౩

క. తత్సమయగతసకలదివి
షత్సంయమినాథు లాత్మసందర్శనసూ
త్సోత్సవమగ్నులుగాఁ గడు
వాత్సల్యంబున నొసర్చె వారలకోర్కుల్. ౨౧౪

వ. ఇట్లు కొలువుండి యనంతరసమయంబునఁ గ్రమ్మఱి యంతఃపురంబున కరిగి సర్వమంగళతోడివినోదగోష్ఠిం దగిలి యభినవసురభిగంధధురంధరచలదలసదవసంబు లగునుపవనంబులలోపలను వినిద్రకాచంద్రవణబాలావాలనిర్మలజలపూరంబు లగువిహారకాననంబులకెలనను నమత్కంఠనీలకంఠయువతీసారకేకారవసుందరంబు లగు కృతకాచలకందరంబులయందును, అతిస్వచ్ఛతీరచ్ఛవిపుష్పగుచ్ఛవిమ్యందమకరందరసాస్వాదనవినోదచంచరీకమిథునమధురఝుణఝుణాలంకారంబు లగుకల్పలతాగారంబులయందును, మఱియు [illegible]

కారంబు లగుతత్తత్ప్రదేశంబుల నెఱుఁగుచోట్ల నిలిచి, చారుముఖ
యుం దాను నిచ్ఛావిహారంబులం జరించుచుఁ గ్రీడించు నాసమయం
బున, ౨౧౫

శా. వీచెం బూర్వదిశాగతశ్వసన మున్వేతెంచె భేకధ్వనుల్
పూచెం గందళకేతకీపటలము ల్వ్యాపిల్లె దూర్వాలతల్
మోచెం గర్భమునుం బలాకలు ముదంబుం దాల్చె మాతంగముల్
వేచెం బాంథులఁ బుష్పధన్వుఁడు గళావిష్కారసారంబుగన్. ౨౧౬

సీ. ఆకసంబున మహితాటవీస్థలమునఁ
దనరుతమాలపాదపము లనఁగ
నంబుజంబునఁ బంకజాకరాంతరమునఁ
బ్రబలుమేచకతమోపలము లనఁగ
నంతరిక్షంబున నచలదేశంబున
మలయుమదాంధసామజము లనఁగ
త్రిదశమార్గంబున నుదధిమార్గంబునఁ
దిరుగునుద్దండమకరము లనఁగ
గీ. నిరులు గొనుచు దిక్కులెల్ల దక్కువడ
దమరతం బనంగ దట్ట మగుచు
చేతి కందినట్టు చెన్నువింతగఁదోఁచె
నంబుగర్భనూతనాంబుదములు. ౨౧౭

శా. జంబూవృక్షము లెల్ల నింద్రమణిభాస్వచ్ఛాయలం బర్వ భా
వంబుం దాల్చినయట్టివండ్లు కడుఁజెల్వం బందె నాకాశమా
ర్గం బుండుం దను శీకర (లేక) జలగర్భస్ఫారతం గల్గు మే
ఘంబుల్ భూమికి వచ్చి నిల్చెనో నాఁగా దృక్పర్వంబులై. ౨౧౮

చ. ఘనతరషడ్జనాదనపికస్వరకేకలమం ద్రిశాఖ్యహం
ఘనములు మ్రోఁగెఁ దోయి శ్రుతివర్వంశేషము నావహించె గో

భగగతు లుల్లసిల్ల సరసహర్షితకంధితరంగభూములం
దోనర లనన్నదోద్ధతమయూరకిశోరకతాండవార్భటుల్. ౨౧౯

క. ఘనసమయ మనడుమాటయు
ఢక్కన నెంతయుఁ జిత్రముకలఁ గొమరొందెడు న
ద్విష తనవపుష్పదామక
మనశ్రీయుఁ గనఁబట్టె సురశరాసన మంతన్. ౨౨౦

మ. తనరారంగ మథూష్ణతాళ ముకుళం దానంచు [1]వర్షాగమం
బున గంపారదివాళి యిచ్చి వలికి న్యూఖాము పాటింగఁ జ
ల్లిన పీరాజనదీపసంతతులపోల్కి [2]న్నింద్రగోపంబుచా
ల్గనుపట్టెం దరుణప్రవాళశకలాకారానుకారంబులై. ౨౨౧

గీ. రాజహంసగతులరాజ మానసమున
వెదకఁ దక్క దివిని వెళయదమ్యొ
రాజహంసగతులరాజమానసరము న
వెదకఁ దక్క దివిని వెళయదమ్యొ. ౨౨౨

క. మొయిలుఁగుంపులఁ దుల నటనట
రోఁటపులు ఘటియించిన త్వా దురుమంజలతు
ర్న లపురఁ జెలంగుచాడ్పున
సొంపులు విలసిల్లె ఘనఘనమోల్లాసములై. ౨౨౩

క. తొలుఁదొలకరిఁ దోడన జేగురు
లోలికఁగ వడగండ్లు దొరఁగి యొప్పెను వర్షా
లలనమెడ హారముక్తా
ఫలములు మెడ యూడి నెఱయఁ బర్విన కరణిన్. ౨౨౪

వ. ఇట్లు క్రమంబుగ వెలసిన ఘనాఘనకాలంబున నాసంవత్రరత్న
లన్, ౨౨౫

1. వద్యాగమం. 2. పోల్కెందిడగోపాల,

మ. [1]..................గండూషితస్వచ్ఛవా
శ్ఛటరించుం దగఁ బుష్కరంబున యదృచ్ఛానల్లకీపల్లవో
త్కటదానంబు లొనర్చుఁ దుండమున నాతంతిప్రజస్వామి త
త్కటకక్షోణులయందు నాత్మరతిఁ గౌతూహలాయాధుఁడై ౨౨౬

క. తార్చునుఖస్థలులను న
ల్లార్చును నిజకరము దృఢతరాసక్తముగాఁ
జార్చును దన్మదగంధముఁ
గూర్చు బ్రమచు లంతకంతఁ గులపతిమీఁదన్. ౨౨౭

ఉ. సారసచంచరీకబకచక్రకహంసకులావతంసకా
సారసమీరభూములఁ బొసంగ రమించు నవీనగంధమం
దారసమూహగుచ్ఛసుమనఃశ్రీపూర్ణ మదప్రహారి మం
దారసమీరము ల్వెలయ నాప్రియుఁ గూడ మనోజలీలలన్. ౨౨౮

వ. మఱియుం జెక్కుటెలుంగులం గలుగువిహారణంబులం దగిలి పొలంగు
నమ్మిథునంబులం జూచి శంకరుండు సతీవదనంబు సప్రహాంబుగా
నిరీక్షించునవసరంబున. ౨౨౯

మ. సతి గాంచెం బ్రతిశుద్ధవర్ణకనకచ్ఛాయాచ్ఛటాభాసురో
ద్గతపాశాంకుశమోదకాక్షయసమగ్రశ్రీసముల్లాసు ను
న్నతదంతాగ్రశోభమానఘనశుండాలక్షణీయు స్నగో
ద్యతకాయుం జగదేకరక్షణమహాత్రాణంబు హేరంబునన్. ౨౩౦

శా. ప్రాచీమూర్ధ్వదిశప్రసన్నతరశోభ న్మించె నవ్యార్యుల
న్పొచిప్కొలుఁడు ప్రజ్వలించె వృషదత్త్వం దుద్యదాహ్లాదనా
వైచిత్రిం బ్రసరించె నంతయు శివబ్రహ్మాండలం బుల్లస
ద్రోచిర్లక్ష్మి వహించె నీశ్వరికిఁ బుత్రుం దల్లి జన్మించినన్. ౨౩౧

వ. తదనంతరంబ వార లక్కడం గదలి రజతగిరికి విచ్చేసిరి; రట్టియెడ,

1. ఈపద్యము మొదటిపాదము వ్రాఁతప్రతిలో గానరాదు. మఱియునిక్కడ
గ్రంథపాత మున్నటు తోఁచెడిని.

గీ. ఆకరీంద్రవదనుఁ డతిరమ్య బాల్యవి
హారలోలహృదయుఁ డగుచు నపుడు
శంకరునకు దక్షసంభవునకు బాల
నింపు సొంపు నావహింపఁ జేసె. ౧౩౩

చ. సతి దను నంకపీఠికఁ బొసంగఁగఁ జేరిచి ముద్దులాడుచో
నతిమహితోద్భటంబు లగునాయమ చన్నుల కొమ్మకుంభముల్
ప్రతియిడి వీని వాని గురుభావము చెప్పు మటంచు ముగ్ధతా
న్వితి నడుగు న్మహేశ్వరుని వీనులకు న్ముద మావహిల్లఁగన్. ౧౩౪

చ. జనకుఁడు తన్ను నూరుతలసంగతుఁ జేసి యథోచితోపలా
లనముల నింపు సేయఁగఁ జెలంగుచుఁ దత్పదనప్రకాశక్రలో
చననికరంబు చూచి జలజాతసరోవర మంచు దొండ మా
య్యన జరిగించుఁ దల్లిహృదయంబునకుం బ్రియముల్ జనింపఁగన్.

వ. మఱియు ననేకవిధంబులం దనరు నీదృశచరితంబులు దిలకింప నింపారుకుమారుం జూచి, విశ్వనాయకుం డతని జగద్రక్షణసౌభాగ్యభాగ్యలక్షణంబులకుఁ దగినట్టుగా నొక్కపుణ్యదివసంబున హరివిరించిపూర్వసురవర్గజయనాదంబులును, దక్షక్రతుముఖ్యసంయమిస్వస్తివాదనాదంబులును, తుంబురునారదప్రముఖమంగళగానంబులును, రంభామేనకాద్యప్సరోంగనా లలితాంగహారసంధానంబులు నుల్లసిల్ల విఘ్నభయహర్తృవు గమ్మనుచుఁ బట్టబంధనవిలాసముఖుం జేసిన నాకరీంద్రముఖుండును సమస్తజగంబులకు నుపాసనీయుండగుచు వెలుఁగుచును నిరతిశుభావందంబున డెందంబు చిగురొత్త నభిమతవిహారణపరుం డగుచుండె. ౧౩౬

క. అవిరళగతి గణనాథో
ద్భవ మనఁగా నిట్లు చెప్పఁబడుభవలీలం
దవిలి పఠించిన వినినను
వివిధసుఖము లొందు విఘ్నవితతులు డిందున్. ౧౩౭

వ. అని చెప్పి మఱియు. ౧౩౮

శా. శంపావల్లిమతల్లికాభరుచిభాస్వత్తీక్ష్ణధారామహో
ఝ్ఝంపాపాతనవిభ్రమభ్రమణశశ్వల్లబ్ధనానార్థలీ
సంపాత క్షతగర్వసర్వఫలతా సంభిన్నమూర్తీభవ
ల్లంపాపాంగ కళింగవంగశక చోళద్రావిళక్ష్మాధిపా. ౧౩౯

క. కాంతవసంతమహోద్భవ
కాంతివరీయః కృతకటకకరహాటవనా
క్రాంత నితాంతలసన్నయ
నాంత సితస్మితమనోహరాననకమలా. ౧౪౦

చామరము.

ఆహవర్ద్ధిధైర్యభూషణా దయారసార్ద్రభాషణా
మహోగ్రవైరిభాస్కరా రమాహటద్యశస్కరా
మహీసురామనోర్జితా సమస్తదోషవర్జితా
యహీనభోగజృంభితా సమగ్రధర్మగుంభితా. ౧౪౧

గద్య :- శ్రీమదష్టభాషాకవితాప్రవీణ బుధజనస్తుత్య
నిశ్శంక కొమ్మనామాత్య ప్రణీతంబైన
శివలీలావిలాసంబునందు
ప్రథమాశ్వాసము.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు - ప్రతిష్ఠాపకులు.

శ్రీ శ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు
పిఠాపురంమహారాజావారు, పరిషద్యావజ్జీవాధ్యక్షులు.

శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు-ఉయ్యూరు జమీందారువారు.

## అధ్యక్షులు.

సాహిత్యవిశారద, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

## కార్యదర్శులు.

కిడాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్.

విఁజమూరి వెంకన్నపంతులుగారు, ఎం. ఏ., (సహాయకోశాధ్యక్షులు.)

## కార్యనిర్వాహక సభాసభ్యులు

శ్రీ దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుఁడుగారు,
(కోశాధ్యక్షులు)

,, పిల్లారిశెట్టి రంగబ్రహ్మరావునాయుఁడుగారు.

,, కోరా శివనాథశాస్త్రిగారు.

,, కొమ్మిరెడ్డి కేశవరామమూర్తినాయుఁడుగారు, బి. ఏ.

,, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

,, నిడుదవోలు వేంకటరావుగారు, ఎం. ఏ.

,, ఏలేశ్వరపు వెంకటరమణసుబ్బారావుగారు, బి. ఏ., బి. ఎల్.

,, ప్రతివాదిభయంకరం పార్థసారథిగారు, బి. ఏ., ఎల్. ఎల్. బి.

,, కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ.

,, కేశవరపు కామరాజుగారు.

,, వేదుల శ్రీరామచంద్రకీర్తిగారు ఎమ్. ఏ. (ఆనర్సు)

# శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు.

## చతుర్థసంపుటము.

శ్రీ పిఠాపురము మహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువులోని రాయల్‌సైజు 1000 పుటలుగల ప్రథమసంపుటమును, 955 పుటలుగల రెండవసంపుటమును, 980 పుటలుగల మూఁడవసంపుటమును, 975 పుటలుగల చతుర్థసంపుటమును, ముద్రితములై విక్రయమునకు సిద్ధముగానున్నవి. ఇందు ప్రథమసంపుటమున అకారము మొదలు, ఔకారము వఱకునుగల యచ్చు లాదియందుఁగల సంస్కృతాంధ్రశబ్దములన్నియుఁ గలవు రెండవసంపుటమున 'క' మొదలు 'జ' వఱకుఁగల శబ్దములును, తృతీయసంపుటమున 'ఝ' మొదలు 'త్సృ' వఱకుఁగలశబ్దములును, చతుర్థసంపుటమున 'థ' మొదలు 'న్ర' వఱకుఁగల శబ్దములును గలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నిటికంటె నిది సర్వవిధముల నుత్తమమయినది. ఈపుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకేగాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయు నను తలంపుతో స్వల్పవెలలు నిర్ణయింపఁబడినవి. ప్రథమసంపుటము సాదాప్రతి వెల రు 5 లు, మేలుప్రతి (Art Paper) రు 7 లు, ద్వితీయసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లు, తృతీయసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లు, చతుర్థసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లు.

---

Printed by N. Achutaramiah at the Cocanada Printing Works Cocanada, and Published by K. Raghavacharyulu, Secretary, Telugu Academy, Cocanada.